శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ద్వితీయ భాగము








గ్రంథకర్త :

పరిపూర్ణ దర్శనాచార్య సదానంద

**యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు**, బి.ఏ., బి.ఎల్.

నర్సాపురం, (ప. గో. జిల్లా)





ద్వితీయ ముద్రణ - 2001
ప్రతులు 1000

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము

## ద్వితీయ భాగము






గ్రంథకర్త :

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద

**యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు,** బి.ఏ., బి.ఎల్.

నర్సాపురం, (ప॥ గో॥ జిల్లా)





ద్వితీయ ముద్రణ - 2001
ప్రతులు 1000

# విషయ సూచిక

# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకటరామచంద్రరావు గారు. శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామదీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంథ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృత మొనరించినారు. వారి శిష్యప్రశిష్యులు వలయు అర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురు ధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ"ను గుంటూరు జిల్లా మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటుచేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించుచున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురుదేవుల శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించు చున్నాము.

ఇట్లు

భక్తమండలి తరపున

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాద రూపం

## బోధోపదేశ ప్రకరణం

శి : కొందరు శ్రుతిస్మృతుల ప్రమాణ మనుసరించి యెరుక పుట్టినదని ముందుగా ప్రతిపాదించి, తరువాత అదిపుట్టనే లేదని సిద్ధాంతంచేసినారు మీరేమంటారు ?

గు : ఆమాట పనికిరాదు. తిష్ఠపంక న్యాయంగా, ముందుగా బురదలో కాలుపెట్టి పిదప కడుగుకొనుటకంటే, కాలు బెట్టక పోవడయే మేలుగాదా ? లేని వంధ్యాసూనుడు పుట్టి, భార్యతో కాపురంచేసి, సంతానము గన్నాడని చెప్పకపోతేలేని వంధ్యాసూనుడు లేనేలేడని మొదటనే చెప్పరాదా ?

శి : అధ్యారోప అపవాదములంటే యివేనా ? కొంచెం వివరించండి స్వామి.

గు : అవును. సూర్యుని యందు యెన్నడులేని చీకటిని వున్నట్లు చెప్పడమే ఆరోపణ, విచారణ సాగించి తుదకు అట్లుండుట అసంభవముగా గుర్తించి ఆ వస్తువందు లేదని సిద్ధాంతం చేయుటే అపవాదము.

శి : ఎరుక యేకాలమందునూ పుట్టనే లేదంటే, ప్రత్యక్షంగా గానవచ్చు యీ ప్రపంచం ఎట్లు పుట్టినది ?

గు : పుట్టెనని అనవలసివస్తే, పుట్టినదనే భ్రాంతియే పుట్టిన దనాలి.

శి : అది స్వయంభూ అని యితరులంటున్నారు.

గు : అది తనకు తానే (యితర మూలం ఏమి లేకనే) పుట్టుటయే స్వయంభూ, పుట్టినదంటే, దేనికి పుట్టినది అనే ప్రశ్నవస్తుంది కనుక తనకుతానే తోచినది అని అనాలి.

శి : పుట్టుటకు తోచుటకు బేధమేమి ? దానిని బ్రహ్మమని యితరులంటున్నారే !

గు : నిజంగా వస్తువు వుత్పత్తి అయితే దానిని పుట్టినదని చెప్పాలి. వున్నట్లు కనబడుటయేగాని విచారించిచూస్తే యేది లేదో దానిని తోచినదని చెప్పాలి. అట్లులేకనే తోచిన యెరుకను నిజంగా పుట్టినదనుకోవడం మొదటి భ్రాంతి. అదిబ్రహ్మమని అనుకొనుట మరీగొప్ప భ్రాంతి. ఎరుక పుట్టినదనే భ్రాంతి రహితం అయితే ఎరుక బ్రహ్మమనే భ్రాంతిలేదు. ఆభ్రాంతి తీరితే ఆ బ్రహ్మమే లేదు.

శి : మరి జీవేశ్వర జగత్తుల మాట ఏమి ?

గు : బ్రహ్మముతోనే జీవేశ్వరులు, విద్యావిద్యలు ద్వైతాద్వైతములు, దృగ్దృశ్యములు యివి అన్నియు వీనికి కారణమైన బ్రహ్మముతోనే పుట్టినవి, కనుక బ్రహ్మముతోనే పుట్టినవి, బ్రహ్మముతోనే పోవును.

శి : విచారించే తన మాట ఏమి ?

గు : బ్రహ్మభ్రాంతే తొలగిపోతే తానే బ్రహ్మమనే భ్రాంతి ఇంకా మిగులునా ? తన యందలి (అలేని బ్రహ్మమందు) ప్రపంచము, సుఖదుఃఖములు యిక యెక్కడనున్నవి ?

శి : యీ అపవాద విషయం శ్రద్ధగా శ్రవణ మనన నిధిధ్యాసలు చేస్తే లేనిది లేనట్టు ధృఢముకాదా?

గు : అగ్నియందు మలిన మున్నట్లు ఏల ఆరోపించవలె ? పిమ్మట ఆ మలినము లేనేలేదని శ్రవణమనన నిధిధ్యాస లేల చేయించవలె ?

శి : శ్రవణ మనన నిధిధ్యాస లేల చేయరాదు ?

గు : తాను లేడుగనుక శ్రవణం లేదు, అంతఃకరణము, జ్ఞానము మనస్సులేవు. మనస్సు లేదు గనుక మననం లేదు. జ్ఞానంలేదు గనుక నిధిధ్యాసయున్నూ లేదు. తానే లేడు. గనుక ఏ నిశ్చయము లేదు.

శి : తానులేననే నిశ్చయజ్ఞానంవున్న పరిపూర్ణు లెవరూ కానవచ్చుట లేదు. అందరూ వున్నవారివలెనే వ్యవహారములు చేస్తూవున్నారు.

గు : పరిపూర్ణులు, చూచేవారికి వున్నట్లుగా తోచబడటమే గాని వారు యెప్పుడూ లేరు. కార్యములు చేసినట్లుగా తోచబడినా లేనివారు కనుక వారు కార్యములు చేయలేదు చూచేవారి భ్రాంతియేగాని వారులేని వారయ్యేవున్నారు.

శి : ఆ విధంగా యెందుకు తోచవలెను స్వామీ ?

గు : దానికిన్ని భ్రాంతియేకారణం. ఎండమావులలో జలమున్నదని ఎవరికి తోచును ? భ్రాంతి చెందినవారికే తోచును. అభ్రాంతి తీరితేగాని జలముకాదని తెలయదు.

శి : ఈబోధ యెట్లా పూర్తిగా ఆరూఢంగా గలదు.

గు : తాబేటి తలపు చేత తాబేలు పిల్లల ఆకలి ఏలాగున తీరినదో ఎవరికి తెలుసును ? ఆ తాబేలు కడుపున పుట్టిన పిల్లలకేగాని పూర్తిగా తెలియదు. అలానే గురుకరుణచేత మేలుకొన్న వారికేగాని యీమర్మము తెలియదు. గొడ్రాలికి బిడ్డనొప్పులు తెలయనట్లు యితరులకు తెలియదు.

శి : గురూపదేశమైన వారందరికీ యీబోధ తెలసినట్లేనా ?

గు : కాదువారు గూడ అంతటి వారు (గురుమూర్తి అంతటివారు) అయినపుడే తెలియగలదు.

శి : స్వస్వరూపానుభవము అయితే సర్వము తెలయబడునంటారుగదా !

గు : ఆ అనుభవము యెవరికి ? అనుభవించుటకు అన్యపదార్థమేది ? స్వస్వరూపానుభవమనగా తాను తానైనట్లు గుర్తించుట కదా ! ఒక కాలమందు తాను కానట్లుగా ఒక కాలమందు తాను అయినట్లుగా చెప్పకూడదు.

శి : మరి ఎట్టినిశ్చయముతో నుండవలెను ? ఏసమాధియందుండవలెను ?

గు : ఏ కాలమందునూ, తాను ఏదికాదు, తానులేనే లేడు అనే నిశ్చయమే వుండవలెను. లేనిసమాధియే దృఢమై వుండగా యింకే సమాధియు గూడదు.

శి : అజ్ఞానముచే జన్మకర్మలు కలుగుచున్నాయనీ, జ్ఞానముచే రహితమగుననీ కొందరంటున్నారు.

గు : జ్ఞానకర్మలు రెండూ జ్ఞానసంబంధమే, తెలుసుకొనేటప్పుడు జ్ఞానమన్నారు, తెలుసుకొని పిదప చేసేపనికి కర్మ అన్నారు. పేరుమాత్రమే భేదము లేని జ్ఞానం చేతఏమి రహితమగును?

శి : ఐతేమీబోధన సాధన చతుష్టము సంపత్తి, శ్రవణమన నాదులు అక్కరలేదా ?

గు : అవన్నీ, వున్న దానికీ అక్కరలేదు లేనిదానికి అక్కరలేదు.

శి : ఎందుచేత ?

గు : స్వతశ్శిద్ధంగా వున్నది వుండనే వుండును లేనిది లేకనే పోయెను. ఇక ఏ సాధనమాత్రం ఎందుకు ? లేనేలేని తాను క్రొత్తగా ఏమి కాగలడు ? తాననే తెరదీస్తే అంతా బట్టబయలే రెండవది ఏమీ లేదు. వినేది, కనేది, అనేది, అన్నీ తనతోనే పోయెను. నేను అనుట నీవు వినుట, కనుట అనునదేమీ లేదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాద రూపం

## రహస్యోపదేశ ప్రకరణం

గు : శ్లో॥ త్యజ ధర్మమ ధర్మంచ, ఉబే సత్యాన్ను తేత్యజ
ఉభే సత్యాన్నృ తేత్యక్త్యాయేనత్యజసి, తత్యజః
యిదే రహస్యం !

శి : ధర్మాధర్మముల రెంటిని విడువమంటున్నారు. ధర్మ మనగానేవి ? అధర్మమనగానేమి ?

గు : ఆత్మయె ధర్మము దేహేంద్రియాదులే అధర్మము శుభవాసనలు ధర్మము అశుభవాసనలు అధర్మము.

శి : సత్యానృతము లేవి ?

గు : సత్యము అనగా ఆత్మ. అసత్యమనగా ప్రపంచ మనస్సులు దేనిచే యీ సమస్తమును విడచెదవో దానిని గూడ విడువవలె సుమా

శి : విడచినా, పట్టినా, వూనినా మానినా, అన్నిచేసేది తానుగదా !

గు : ఆ తాననే తెరయే తెగగొట్టవలెను.

శి : ఆ తెరదేనిని మరుగు పరుచుచున్నది ?

గు : పూర్ణమునకు గూడ పూర్ణమగుటచే పరిపూర్ణమనీ, పరునికి (అనగా పరమాత్మకు) కూడ పరమగుటచే పరాత్పర మనిన్ని, దృశ్యమునకే కాక ద్రుక్కుకు కూడవేరై పరిపూర్ణ పరబాహ్యమని వ్యవహారము కొరకు పేరుపెట్టబడిన వస్తువును మరుగు పరచుచున్నది.

శి : తానున్నందువల్ల నష్టమేమి ?

గు : స్త్రీయే భోగభూమి స్త్రీవుంటే సర్వకోరికలు ఒక టోకటిగా కల్గుచున్నవి.

శి : తాను అనే దాని గూర్చినేనడిగితే స్త్రీ విషయమేల స్వామి !

గు : స్త్రీ అనగా, సకార తకార, రేఫ, యీ కారములు గూడికదా స్త్రీ అనే శబ్దంపుట్టినది స సత్వగుణం త తమోగుణం; ర రజోగుణం యీ మూడు గుణములు ప్రకృతి యందున్నవి. ప్రకృతి సగుణము పురుషుడు నిర్గుణము, అని వేదాంతులు (అద్వైతులు) అందురు. కాని పురుష ప్రకృతులు భిన్నులుకాదు. సృష్టికి పూర్వము త్రిగుణములు పరమాత్మయందు బీజ రూపంగా నున్నవి స్థూలావిర్భావము చెందనంత మాత్రమున అదిశుద్ధ నిర్గుణము కాదు. కనుక దానిని కూడ స్త్రీయనే అనాలి. మరిన్నీ దానినే భూతయోనిగా బ్రహ్మసూత్రములున్ను చెప్పినవిగదా !

శి : అర్థమైంది స్వామీ అట్టి త్రిగుణములు గర్భీకృత మొనర్చుకొన్న పరమాత్మయే స్త్రీ ఆ పరమాత్మయే తాను గనుక తాననే తెరయున్నంత కాలమూ యిచ్ఛా రాహిత్యం. లేక భ్రాంతి రహితంకాదు అని శెలవిస్తున్నారు. అంతేనా స్వామీ !

గు : అవును కనుక యెరుక ఎక్కడ వుండునో అక్కడ సర్వేచ్ఛలూ వుండును, అదేమాయ అదిలేకపోతే మాయ మాయకార్యములు లేవు ఏ భయమున్ను లేదు. అదేలేకుంటే దానిచేత తోచబడిన ప్రపంచమూ లేదు లోపలను లేదు. బైటనూ లేదు. మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమీ లేదు. ఈగురు వాక్యము దృఢమై సదా తాను లేకుండా వుండవలెను.

శి : అది యెట్లా దృఢమౌతుంది ప్రభూ !

గు : నేను లేదనడమే దృఢము తాను లేకపోవడమే పరిపూర్ణం ఈ వుత్త బట్టబయలు ఏమీలేదు.

శి : అన్న మాత్రంచేత లేకుండాపోతుందా ! దానికి తగిన ఏయోగసాధనేనా చేయవలసి వుంటుందేమో !

గు : శ్లో॥ సర్వభూతం సదావ్యాప్తం, సత్యలోకాధి వాసితం యింద్రియాణాం నిరోధేన కథంసిద్ధ్యంతి యోగిన॥ కనుక అట్టిది యింద్రియ నిరోధంచేత యెట్లు సిద్ధించును ? వస్తువు సర్వత్ర వ్యాప్తము. వస్తురహితమై యున్నదాన్ని గురించి ఏ యోగములు పనికిరావు.

శి : ఎందుచేత స్వామి !

గు : యోగంచేస్తే కానవచ్చేదీ, లేకుంటే కానరానిదీ ఎన్నడూ పరిపూర్ణంకాదు. దేనికి దృశ్యమైనా అట్లు దృశ్యమైనది నశించేదే అవుతుంది. అంతేకాదు, చూచే యెరుక పుట్టనేలేదు. బట్టబయలులో ఎరుక పుట్టనేలేదు.

శి : యెరుక పుట్టనే లేదంటే గురుశిష్యులు, వుపదేశము యివి అన్నియు యేమైనట్లు ?

గు : ఉపదేశము చేసేటందుకు గురుశిష్యులు లేరు. ఎవరు లేరనేటందుకు కూడా యెరుకలేదు. వ్యాప్య వ్యాపకములకు వ్యాప్తే లేదు. అన్నీ యెరుకతోనే పోయెను. యిట్లెరిగేటందుకు కూడా ఎవరూ లేరు. మాయ, అజ్ఞానమూ, జ్ఞానమూ, యివి ఏమీ లేవు. ఎరుక లేదు. గురుడు పోగొట్టనేలేదు.

శి : ఐతే యివన్నీ చెప్పేమీరు వుండీచెప్పినారా, లేక, లేక చెప్పినారా ? మీరు లేకపోతే చెప్పనే చెప్పరుగదా ! మరి వుండగా లేకపోరుగదా !

గు : ఆకాశమనేది ఒకటి వున్నట్లు అదిశబ్దగుణకమై వున్నట్లు మనంపల్కిన తర్వాత తోచినది. అలాగే ఎరుకొక్కటి తోచితే అన్నీవున్నట్లే తోచినవి అలాగే అనుకో, నీకు వినినట్లు అన్నట్టుగా తోచినది, కాని నేను ఏకాలమందును లేను. నేను లేకపోతే నాకు ఏమిలేదు.

శి : నేనే బ్రహ్మము, అని వేదాంతులు (అద్వైతులు) మహా వాక్య ప్రమాణము ననుసరించి చెప్పుచూ వుంటే మీరు "నేను లేను" అని నొక్కి చెప్పుచున్నారు ! ఇదిఏమి ? వేదాంతులు చెప్పేది మీరు చెప్పేది ఒక బ్రహ్మము గురించేగా !

గు : కాదు కాదు వేదములు అన్నిటిని బ్రహ్మమే అని చెప్పినవి. అన్నము, ప్రాణం, వాక్కు శ్రోత్రం చక్షువు, మనస్సు ఒక్కొక్కదానినే పరబ్రహ్మమని చెప్పుతూ, చివరకు నేనే బ్రహ్మము అని కూడా చెప్పినవి అన్నిటికి పరమై (యితరమై) మనస్సునకే మాత్రం అందక వున్నది కనుకనే దానిని పరబ్రహ్మము అని వాడినారు. ఇది అదికాదు. అది యిదికాదు అని దీక్షితీయ సాంప్రదాయం. ఇది అనగా "అయమాత్మాబ్రహ్మ" అనబడేది. "మనసైవానుద్రష్టవ్యం" అనగా మనసునకందేది" ఇది "అది" అనగా "అయంవ్యర్థం బాహ్యః కోపీన భవతి" అని సూచింపబడినది ఏదో అదే "అది", అతద్వ్యావృత్తి లక్షణముచే "నేతి నేతి" అంటూ నీవాక్కు మనస్సు పడిపోయేవరకు అనుకోగా ఆపైన నీకు తెలియబడకుండా మిగిలి పోయిన దేదో అదే సూచింపబడినది. దానికి పరిపూర్ణ బ్రహ్మమని పేరెట్టినారు. వేదాంతులు చెప్పే బ్రహ్మమే పరిపూర్ణ భావజ్ఞులు చెప్పే సర్వాతీత పరబ్రహ్మమని అనదగునా ? దీక్షితీయ సంప్రదాయకు లెన్నడైనా అంగీకరింతురా ! అంగీకరిస్తే వారు గురుద్రోహులే అవుతారు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## అన్యవాది నిరసన ప్రకరణము

### గురుశిష్య సంవాద రూపం

గు : పుట్టకగిట్టక తిట్టకకొట్టక, పట్టువిడుపులు లేక, ఆద్యంత రహితమై అవాచ్యమై అచలమై పరిపూర్ణమైనది బ్రహ్మము.

శి : అది అంతరమందు ఉన్నదా ? బాహ్యమందు ఉన్నదా ?

గు : అన్నిటి బాహ్యాభ్యంతరములంయందూ ఉన్న అపరిపూర్ణ బ్రహ్మమును ఎవరూ గుర్తెరుగరు.

శి : మరింకెందుకు ?

గు : గుర్తెరుగక గుర్తెరిగితే గురుతురహితమగును, సద్గురూపదేశము లేకపోతే గుర్తురహితము కాదు. గర్తురహితము కాకపోతే గురుసాంప్రదాయకుడుకాడు మిగిలిన మార్గము లన్నియూ అహంకారముతో కూడుకొన్నవే.

శి : అహంకారము లేని సాంప్రదాయమేది ?

గు : పరిపూర్ణబోధయే, అహంకాంరరహితమైనవారికే పరిపూర్ణబోధ చెప్పవలెను. కాని అహంకారము గట్టిగా పాదుచేసుకొన్న వారికి చెప్పగూడదు.

శి : అహంకారమనగా నేమి ?

గు : అహంకారమనగా "అహంబ్రహ్మాస్మి = నేనేబ్రహ్మము అనడమే అహంకారం. అయ్మమాత్మాబ్రహ్మ = ఈ యాత్మయే బ్రహ్మము; ప్రజ్ఞానం బ్రహ్మ = సర్వమును ఏది గుర్తెరుగుచున్నదో దానిని గుర్తెరుగుచున్నదే ప్రజ్ఞానము, అదే బ్రహ్మము తత్వమసి = ఆ బ్రహ్మమే నీవైతివి అని మహావాక్యములచేత అనడమే అజ్ఞానము.

శి : అదేమిస్వామి ? మహావాక్యార్ధజ్ఞానము. శ్రవణమన నాదులు చేయుట అజ్ఞానమా ?

గు : అజ్ఞానము కాకమరేమి ? జ్ఞానస్వరూపమైన తెలివి మునుపుతాను కాకపోవుటయేలాగు ? శ్రవణమనన నిధిధ్యాసలచేత బ్రహ్మము కావడము ఏలాగు ? అనేది తెలియకుండా అహమస్మి అనేదే జ్ఞానము. అజ్ఞానమే జ్ఞానము. జ్ఞానమే అజ్ఞానముకాని వేరుకాదు. జ్ఞానాజ్ఞాన నిరసనమే పరిపూర్ణబోధ.

శి : మరి అచలబోధ అనగానేమి ?

గు : చలించని వస్తువును సూచించును కనుకనే అచలబోధ. ఇది వేదవేదాంతాతీతము, పరమరహస్యము ఈ మర్మము తెలియక బ్రహ్మము ఎక్కడ ఉన్నదో అని అంతుచిక్కక భ్రష్టులై గుహలయందు కొందరున్నారు. ఆకులు అలములుతిని మూర్ఖులకన్ననూ ఎక్కువమందమతులై ఇంకా కొందరున్నారు.

శి : శరీరమునందు ఏ అభిమానమూ లేక పసిపాపలవలె దిగంబరులై తిరుగువారు భ్రాంతిరహితులుకారా ?

గు : యోగులమని, సన్యాసులమని, అవధూతలమని, దిగంబరులమని, బట్టలువిడచి తిరగడమేగాని సర్వవ్యాప్తమైన పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియలేరు.

శి : సచ్చిదానంత స్వరూపమైన బ్రహ్మమునే పరిపూర్ణ పరబ్రహ్మమని కొందరంటున్నారే ?

గు : అనేక వికారములతో, కూడుకొని ఉన్నది బ్రహ్మమా ? అతడు చిన్మాత్రుడని సన్మాత్రుడని అనుకొని యోగాభ్యాసాది సాధనలు చేస్తే బ్రహ్మవేత్త లగుదురా ? అవన్నియు మాయోపాసనలే.

శి : పరిపూర్ణ బోధవినుటకు అందరికి అధికారముగలదా ?

గు : ఎక్కువ ఆసక్తిగల వానికి పరిపక్వచిత్తముకలవానికి చెప్పవలసినదేకాని అందరికి చెప్పకూడదు. ఇతరులు అడిగితే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమేబ్రహ్మమని శ్రుతి ప్రమాణములచేత చెప్పవలసినది అదియైననూ అనేక కష్టములు పెట్టి చెప్పవలసినదే కాని ఊరకే చెప్పకూడదు. తనకెంత బంధుత్వమున్ననూ. ఎంత పీడించిననూ ఎంతసేవచేసిననూ ఎంతభక్తితోనున్ననూ అత్యంత పరిపక్వచిత్తములేని వానికి మాత్రము చెప్పరాదు. ద్రవ్యకాంక్షకొఱకు చెప్పితే గురుశిష్యులిద్దరూ చెడిపోవుదురు.

శి : పరిపూర్ణమును గుర్తెరిగినది ఈ ఎరుక చేతనేకదా కనుక ఈ ఎరుక ఎక్కువకాదా ? అని కొందరన్నారు.

గు : అనుభవములేని శాస్త్రవాదులంటే అనవచ్చును. మరి -- ఈ ఎరుక పరిపూర్ణమును గుర్తెరిగెగదా ! అచలము యేరూపముగ ఉన్నది ? ఏ వర్ణముగా ఉన్నది ? లావా, సన్నమా ? ఎంత పొడవు ? ఎంత వెడల్పు ? గుర్తెరిగితే చెప్పరాదా . పరిపూర్ణము తప్ప రెండవ వస్తువు సర్వవ్యాప్తమై ఉన్నట్లు చూపించమను, చూతము!

శి : సచ్చిదానందస్వరూపముగూడా సర్వవ్యాప్తమని అనేక శ్రుతులు వర్ణించుటలేదా ? గుర్తెరిగిన గుర్తేపరబ్రహ్మమని ఎందుకనరాదు ?

గు : తాను ఎటుచూస్తే అటు వ్యాప్తమై గుర్తెరుగుచున్నది. కాని ఒక గోడచాటైతే గుర్తెరుగుచున్నదా? అటువంటి గుర్తుసర్వవ్యాపకముకాదు. పరిపూర్ణ పరబ్రహ్మమూకాదు.

శి : కొందరు దృక్కే బ్రహ్మమని అంటున్నారే ?

గు : దృక్కు బ్రహ్మమని అంటే సుషుప్తియం దేమాయెను ? చచ్చినప్పుడే మాయెను ? చనిపోతూ అన్ని శరీరముల యందు పుట్టుచూ చచ్చుచూ ఇట్లు అన్ని శరీరాల్లో తిరుగుచూ ఉన్నటువంటి జ్ఞానము బ్రహ్మము ఎలాగు పిల్లవానికైనా కాదని తెలియును. ఇవన్నీ భ్రాంతి వాక్యములేకాని వాస్తవములు కావు.

శి : కొందరు పరిపూర్ణమును శూన్యమని అంటున్నారే ?

గు : ఆ మాట అనకూడదు. వినకూడదు ప్రపంచములో కానరానటువంటి వస్తువు శూన్యముకాని ప్రత్యక్షముగా సర్వత్రానిండి నిబిడీకృతమైయున్న పరిపూర్ణము శూన్యముకాదు. కొంతకాలము మాత్రమే ఉండిపోయ్యే దానిని శూన్యమనదగును కాని సర్వకాలములయందు, సర్వదేశములయందు, సర్వావస్తలయందు శూన్యముగాక పూర్ణమై ఉన్నటువంటి దానిని శూన్యమనుటకు సిగ్గుకాదేమో ! వీరికి నోరుయేలాగున ఆడెనో?

శి : శూన్యమైతే ఎట్లుండును ?

గు : శూన్యమైతే ఎరుకవలెనే రాకడ, పోకడగల్గి, ఒకచోటు ఉండటము, ఒకచోట లేకపోవడము, అన్ని శరీరాల్లో ప్రవేశిస్తూ ఉండడమూ శరీరాలను విడిచిపోతూ

ఉండటము ఉండును. గనుక తానే శూన్యమని తెలియకతనను గొప్పదానినిగా భావించవలెననని వేదశాస్త్ర పురాణములను కల్పించి త్రిమూర్తులతోనహా అంతయుతానేయై చచ్చుచూ పుట్టుచూ ఉన్నది.

శి : పరిపూర్ణమును నమ్మినందువల్ల ప్రయోజనమేమి ?

గు : పరిపూర్ణము సర్వవ్యాప్తము దానిని నమ్మితే ఎరుక నశించును. గనుక ఎరుకను విడచినమ్మక నమ్మవలెను.

శి : ఎరుక భ్రాంతికారకమని తమరు సెలవిచ్చినారు అది ఎట్లు ?

గు : తనలీలయందు భ్రాంతిపుట్టించి పరిపూర్ణ పరబ్రహ్మనిశ్చయము లేకుండా చేయవలయునని ఎరుక ప్రయత్నము.

శి : ఎరుకపోతే ఏలాగు ?

గు : నీకు మునిగిపోతానని భయముంటే నాజోలికేరాకు లేనివారి సహవాసమువలన లేకపోతావు. ఆపైన నీవైన ఎరుక నిలువనే నిలువదు. నాజోలికిరాకు వచ్చినట్లైతే నావలెనే ఎక్కడా ఏమీలేకుండా పోతావు ఇదేనిశ్చయము.

శి : ఈ భోధ ఎట్లబ్బును ? ఈభోధ దొరికితే ఎరుక ఎట్లులేకపోవును ?

గు : ఎండ లోనికిపోతే శీతలము పోయినట్లుగా, ఇది తెలిసితే అది ఉండదు. ఈ బోధదొరికేదే కఠినము, దొరికితే అతిసులభము.

శి : ఈ మార్గము ఎటువంటిది ?

గు : వేద శాస్త్రపురాణములవంటి వెర్రిమార్గముకాదు, నీవే వాస్తవ మన్నట్లుకాదు. నీవే బ్రహ్మమన్నట్లు కాదు. నీవు బ్రహ్మమవుతావన్నట్లుకాదు, ఈ బోధ బడసిన ఏ భ్రాంతి ఉండదు. కలగని మేలుకొన్నట్లుగా తెలియక తెలిస్తే నీవేలేకపోతావు. నామాట నమ్మకనే నమ్ము వినకనేవిను; ఇంతేగాని ఏమియూ లేదు. "ఏమిలేదు"; అని అన్నదే ఏమిలేదు కోటిమాటలకైనా ఇదే జ్ఞాపకముంచుకో, ఇదే వాస్తవము ? నిన్నువిడిచి చూస్తే నిశ్చయము.

శి : కొందరు "ఆత్మనః ఆకాశస్సం భూతః" అనుశ్రుతి వాక్యము చెప్పినారు. మరి ఆత్మేపరిపూర్ణమంటున్నారు ?

గు : అది ఎట్లాగంటే గొడ్రాలికి పిల్లపుట్టినదంటే ఏపిల్ల అని అడిగినట్లుగా, దున్నపోతు ఈనినదంటే రాటకు కట్టివేయమన్నట్లుగా ఉన్నది. పరిపూర్ణము ఆకాశము పుట్టినదంటే ఏలా పుట్టింది ?

శి : శబ్దగుణము ఆకాశమని అన్నారు ?

గు : శబ్దగుణముకలది ఎదియో అదే ఎరుక ఆకాశమని తెలియక అన్నారు. అదేపరిపూర్ణమైనచో పరిపూర్ణం నుంచి ఎరుక లేక ఆకాశము పుట్టిందని అనవలసి వచ్చును. అప్పుడు పరిపూర్ణము, ఆత్మఎరుక ఆకాశం అన్నీ ఒకటే అనవలసి వచ్చును.

శి : అంటే ఏమి ? మీరు పరిపూర్ణమును బయలని అంటూనే ఉన్నారు కదా ?

గు : పంచీకరణంలో ఆకాశము నాలుగుభాగములైందని ఈ భాగములు వాయువుతో కూడి మనస్సు, అగ్నితో కూడి బుద్ధి, జలముతోకూడి చిత్తము, పృధ్వితోకూడి అహంకారము అని చెప్పేరుకదా ? మరిపూర్ణము పోయి ఒకదానితో కలసెనా ? చెడెనా లేదని అందరికి స్పష్టమే, వేదాంతము తెలియని మూర్ఖులు అన్నారంటే సరే; కాని తెలిసినవారనకూడదు. ఆకాశమందు శబ్దమున్నది. పరిపూర్ణమందు (బయలందు) శబ్దమేది ? ఎంతవారూ చూపించలేరు.

శి : ఆకాశమునందు మాత్రమున్నదా ? మేఘాశ్రయమువల్ల ఉరుములు పుట్టినవి. పుట్టిననూ మేఘములు విచ్చిపోవుటతోనే తొలగిపోయినవి. అటులే పరిపూర్ణమందు శబ్దము పుట్టినదని దృష్టాంతం చెప్పినారేమో ?

గు : ఆ దృష్టాంతము చెప్పకూడదు ఏలననగా ఆకాశమునందు శబ్దము బీజరూపముగా సూక్ష్మమై ఎల్లప్పుడూ ఉండనే ఉన్నది. పరిపూర్ణమందు శబ్దరూపమైన ఎరుక ఏకాలము నందూలేదు. గనుక ఈ దృష్టాంతమే పనికిరాదు.

శి : కొందరు అంధకారమే పరిపూర్ణమన్నారు.

గు : చీ, చీ అట్లు ఎన్నటికి అనరాదు, సూర్యచంద్రాదులు పోతే అంధకారముకాదా ? రాకపోకలతో కూడిన ఈ అంధకారము బ్రహ్మమగునా ?

శి : పరిపూర్ణము ఎటువంటిది. ప్రకాశమా ? అంధకారమా ? లేక జ్ఞానమా ? అజ్ఞానమా ?

గు : పరిపూర్ణము ప్రకాశముకాదు. సాక్షికాదు జ్ఞేయమూ కాదు, వ్యాప్యము కాదు; వ్యాపకము కాదు; పరిపూర్ణమునకు ఏమీలేదు; అంధకారమని తోచినవారు తమయందున్న అంధకారమును పరిపూర్ణమందు ఆరోపించిరని అనవలె.

శి : కొందరు సంసారమే మంచిదని అంటారు ఎందుచేత ?

గు : తన భావము తెలియనీయక అందరివలె ఉండి ఎవరు ఏమినిననూ తెలియనీయక అందరివలె ఉండి ఎవరు ఏమనిననూ మాటే అని వారిని సంతోషపరిచితే తనకేమి లోపము ? తానే లేడుగనుక ఏమీలేదు. అంతా పరిపూర్ణమే. అట్టివాడు ఎన్ని కార్యములు చేసిననూ పుణ్యపాపములు ఏమీ లేవు. బంధములేదు మోక్షమూ లేదు.

శి : పూర్ణబోధ అంతటిదే కావచ్చును కాని ఎరుకయందె ఉండిఎరుకపనులే చేస్తూ ఉంటే పాపపుణ్యములు అంటకుండా ఎట్లుండును ?

గు : శ్లో ॥ మాంసాదుత్పద్యతేక్షీరం మాంసం క్షీరం నలిప్యతే
పంకాదుత్పద్యతే కీటం కీటం పంకంవలిప్యతే
సలిలాదుత్పద్యతే పద్మం సలిలం పద్మంనలిప్యతే
లోకాదుత్పద్యతే జ్ఞానం జ్ఞానం లోకం నలిప్యతే ॥

శి : స్వామీ దృష్టాంతరములు బాగానే ఉన్నవికాని ఏసత్తాపైన శిష్యుడు ఇట్లుండగలడు?

గు : గురునత్తాపైన, ప్రాణంపోయినా సరేగాని జ్ఞానమునందు గురువునందు జ్ఞానులైన పెద్దలయందు భక్తి యుండవలె, ఉన్ననూ సరే లేకున్ననూ సరేనని గురుభక్తివిహీనము కాకూడదు.

శి : గొప్పదైన ఇట్టిపరిపూర్ణ బోధయందున్న పెద్దలను సహితము చూచి కొందరు దూషించుదురే?

గు : దుర్మార్గులన్నంత మాత్రమున తనకేమి తక్కువగును అట్టిదూషణ జరుగుచోట వుండకూడదు.

శి : ఈ పరిపూర్ణబోధ మార్గముగాక మరొకవిధముగా సాధ్యము కాదా ?

గు : సర్వకాలములయందు, సకల దేశములందూ సర్వావస్థలయందు సకలవస్తువులందు మొదలుకొనలేక వ్యాప్తమై ఉన్నదే పరిపూర్ణము. అందరియందు లోపల వెలుపల నిండియున్నదే పరిపూర్ణము దీనిని గురుకటాక్షము వలన తెలుసుకొని తాను లేకుండాపోవలెనుఈ మార్గము తెలియక రెండవ మార్గమువలన ఎరుక లేకుండ పోదు. ఇందుకు ఏయుక్తి, ఏమాట, ఏయోగము, ఏజపము, ఏఅనుష్ఠానము, ఏభక్తి, ఏమతము. ఏశాస్త్రములు ఏ భాష్యములు, ఏవీ పనికిరావు. ఇంకేమి చెప్పవలయును ఏమిచెప్పినా ఏమీ లేదు, ఏదీపనికిరాదు. ఏమనుటకునూ ఏమిలేదు, ఏమైనా చెప్పితే అదంతాసోది ఇదితెలిస్తే అంతా అచలమే.

శ్లో॥ అనంతకోటి జన్మాని ఆత్మజ్ఞానంచలభ్యతే
ఆత్మజ్ఞానమనవంతానిలభ్యతే పూర్ణాభోధతః॥

0 ------- 0

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాద రూపం

## పరిపూర్ణ విమర్శ ప్రకరణము

శి : పరిపూర్ణము యేలాంటిది !

గు : అది పదార్థము కాదు. సప్తవిధలక్షణములు దానికి లేవు.

శి : సప్తవిధ లక్షణములేమోసెలవీయండి స్వామీ ?

గు : శ్లో॥ ద్రవ్యం గుణస్తదాకర్మ, సామాన్యం
సవిశేషకః (సమవాయస్త ధాభావః పదార్థన్య
ప్రకీర్తితః॥ (ద్రవ్యము, గుణము, కర్మ సామాన్యము, విశేషము, సమవాయము, అభావము), అనునవేసప్త పదార్థ లక్షణములు, యివిగాని, వీని సంపర్కముగాని లేనిదే పరిపూర్ణము.

శి : యెట్లాగొ వివరించండి స్వామి !

గు : పరిపూర్ణము రూపరహితము గనుక నవవిధ ద్రవ్యములు గాదు. నిర్గుణమైయున్నది కనుక చతుర్వింశతి గుణములున్నూ కాదు. సర్వవ్యాప్తమున్ను చైతన్య విహనమున్నూ గనుక పంచకర్మలూ గావు, అటువంటిది మరొకటిలేదు. కనుక సామాన్యముగాదు. నిత్యానిత్య ద్రవ్యవృత్తి విశేషరహితము గనుక విశేషము కాదు. అది పదార్థమే గాదు. మరిన్ని పదార్థానికి కారణమున్నూ గాదు. భావమే లేదు కనుక చతుర్విధ అభావములున్నూ కాదు. యీ విధంగా పరిపూర్ణమునకు నవ్వవిధ పదార్ధములలక్షణలునూ లేవు.

శి : అయ్యా యింకనూ వివరించాలి స్వామి ! నవవిధద్రవ్యము లేవేవి ?

గు : శ్లో॥ క్షిత్యప్తైజో మరుద్వ్యోమ కాలదిగ్దేహినో
మనః ఏతెనవ విధప్రోక్తాః ద్రవ్యాణి చమహత్మభి ః॥

అనగా :- పంచభూతములు కాలము దిక్కులు మనస్సు ఆత్మ అనునవే నవవిధ ద్రవ్యములు. పరిపూర్ణము ఏదీకాదు. ఎట్లనగా --- దృశ్యములున్నూ కాదు కనుక గంధరూప పృథివికాదు. రసద్రవత్వాద్చులు లేవు కనుక సరిత్సముద్రాది జలరూప ద్రవ్యము కాదు. ఉష్ణత్వ తేజత్వములు లేవుకనుక వహ్ని రూపద్రవ్యములు కావు. స్పర్శలేదు కనుక వృక్షాది కంపన హేతుభూత వాయురూప ద్రవ్యము కాదు. శబ్దావకాశములు లేవు కనుక ఆకాశము కాదు భూతభవిష్యద్వర్తమాన, క్షణమానాది, వ్యవహారహేతు భూతముకాదు కనుక కాలద్రవ్యమన్నూ కాదు. సర్వవ్యాప్తము కనుక ప్రాచీ ప్రతీచ్యాది (తూర్పు పడమర లాదిగా) వ్యవహార భూతమగు దిక్సంబంధమైన ద్రవ్యము కాదు. కార్య కారణరహితము కనుక జ్ఞానాధి కరణమూజీవేశ్వర రూపమునైన ఆత్మరూప ద్రవ్యముకాదు. నిర్గుణమునూ సంకల్ప వికల్ప మహదహంకార శూన్యమున్నూ అణు రూపముకానిది అగుటచేత అది మనోరూప ద్రవ్యమున్నూ కాదు.

శి : చతుర్వింశతి గుణములేవి ?

గు : శబ్దాదులైన; సంఖ్యా పరిమాణ, పృథక్త్వ, సంయోగ విభాగములు పరతత్వ, అపరతత్వ, లఘుత్వ గురుత్వంలు ద్రవ్యత్వము, స్నేహము, బుద్ధి, సుఖదుఃఖములు, యిచ్ఛా ప్రయత్నములు ధర్మాధర్మములు సంస్కారము అనునవే చతుర్వింశతి గుణములు, పరిపూర్ణమందీ గుణము లేమీలేవు.

శి : ఏలాగో శెలవీయండి స్వామి !

గు : ఆపరిపూర్ణము, చక్షురింద్రియ గ్రాహ్యము కాదు, కనుక నీలాది వర్ణములుగాని వానిసముదాయముగాని యందులేదు రసనేంద్రియ గ్రాహ్యముకాదు కనుక మధురాది షడ్రససహిత ద్రవ్యమేదిన్ని లేదు. ఘ్రాణేంద్రియ గ్రాహ్యము కాదు కనుక సుగంధ

దుర్గంధ ద్రవ్యములున్నూ లేవు. త్వగింద్రియ గ్రాహము కాదు కనుక శీతోష్ణాది గుణరూప ద్రవ్యమున్నూ లేదు నిశ్శబ్దము గనుక భేరీమృదంగ శబ్దాది హేతుభూత ద్రవ్యమున్నూ కాదు కనుక శబ్దగుణము లేదు. ఏకత్యాది వ్యవహార శూన్యము గనుక సంఖ్యా రూప గుణమున్నూ లేదు. అమితం గనుకనున్నూ అణుప్రమాణ మధ్యప్రమాణ, మహత్ప్రమానములు లేవు గనుకనున్నూ పరిమాణ గుణమున్ను లేదు. సర్వవ్యాప్తముగా నున్నందుననున్నూ, బిన్నత్వ హేతువు లేనందునున్నూ పృథక్స్వరూపమైన గుణములేదు, పరిపూర్ణము అచలము గనుక, చలనమే లేదు. కూడిక అసంభవం సంయోగమను గుణమున్ను లేదు, అపరిచ్ఛిన్నం గనుక విభాగమున్నూ లేదు. అఖండమగుటచేతనున్నూ దానికి స్థూల సూక్ష్మాదులు లేవు గనుకనున్న పరతత్వ అపరతత్వగుణములున్నూ లేవు. ఆద్యంత రహితమున్ను అపరిమితమున్నూ గనుక లఘుత్వ గురుత్వములు లేవు. సర్వరస విహీనము గనుక ద్రవత్వము లేదు. చూర్ణాది లక్షణములే లేవు కనుక పిండి కృతహేతు భూతమగు స్నేహగుణమున్నూ లేదు. అజ్ఞాతమున్నూ నిర్విషయమున్నూ గనుక అయంపటః (యిదివస్త్రము) యిత్యాది కారణములేదు గనుక బుద్ధిరూప గుణమున్ను లేదు. జగద్విలక్షణము గనుక జగత్సంబంధమైన స్రక్చందన వనితాది సంయోగజాత గుణమైన సుఖమున్ను లేదు, అబాధ్యం గనుక దుఃఖమున్నూ లేదు. సర్వకామ వర్జితమున్నూ సర్వానంద విహీనమున్నూ గనుక యిచ్ఛాప్రయత్న గుణములు గాని ధర్మాధర్మములు గాని సంస్కారముగాని లేవు. చతుర్వింశతి గుణములున్నూ లేవు.

శి : పంచకర్మలూ యేవి ? అవి పరిపూర్ణమందెట్లు లేవో సెలవీయండి స్వామి !

గు : శ్లో॥ ఉత్క్షేపణం, తతోక్షేపణ మాకుంచనం తథా !

ప్రసారణంచ గమనం, కర్మణ్యేతాని పంచకః॥

అనగా పైకెగురుట క్రిందకి దిగుట, ముడుచుట, చాపుట, నడుచుట అనునవే పంచ కర్మలు ! అచలము గనుక నున్ను, అవకాశ రహితము గనుకనున్ను సర్వ పరిపూర్ణము గనుకనున్నూ, పరిపూర్ణ మందీ పంచ కర్మలూ లేవు.

శి : పరిపూర్ణ మిట్టిదని ఎవరున్నూ ఎరుగరా ?

గు : ఆకాశమనిన్ని శూన్యమనిన్ని వినాశోత్పత్తులు కలవనిన్ని, తమయందుగల వికారములను దానికారోపింతురు పచ్చకామెర్ల రోగికి జగమంతయూ పచ్చగానే కానవచ్చినట్లుగానే దానిని గుర్తెరుగుదురు. అంతేకాని, ఆది అప్రతర్క్యమనిన్ని, ఆది మధ్యాంత రహితమనిన్ని, చిజ్జడ రహితమనిన్ని సదస ద్విహీనమనిన్ని, దానిని తెలుసుకొనలేరు;

శి : ఐతే, అసలు పరిపూర్ణమును యెరిగినవారంటూ వున్నారా లేదా ?

గు : గురుముఖతః పరిపూర్ణము నెరుగని వారు యెరుగనే యెరుగరు యెరిగినవారు లేకనేపోవుచున్నారు గనుక ఎరిగినవారు లేరన్నారు.

శి : ఎట్లాలేక పోతారు ?

గు : వారి యెరుక లేనిదే అగుచున్నది. ఏలాగంటే, చిల్లగింజ (యిండుగ) గంధము నీటిని విరిచిబురదను లేకుండాచేసి ఆబురదతోబాటే తానూలేకుండా పోవుచున్నది అట్లే ఎరుకతో పాటు దేహేంద్రియ ప్రాణబుద్ధికూటస్థ అహంవృత్తులు మొదలైన వన్నీ యెరుకతోనే పోవుచున్నవి అజ్ఞాన విజ్ఞానములుతో పాటు సాక్షియున్నూ పోవుచున్నది.

శి : యింకా ఏమైనా దృష్టాంతములున్నవా ?

గు : లేకేమి ? చేపలతో పాటు నాచుకూడా వలలోనికి వచ్చినట్టు చేదకోసం గేలం వేస్తే బావి అడుగుననున్న యితర వస్తువులుకూడా పైకివచ్చినట్టు, తల్లి వేరుకొట్టితే పర్ణపుష్పఫలాదిసహితంగా చెట్టు నశించిపోవునట్లున్న నిలిచే ఆస్పదంలేక శిఖీ కర్పూరవత్తుగా తగులడిపోవును పరిపూర్ణ బోధతెలిస్తే సర్వభ్రాంతులూ నశించును ఎరుక లోపలా వెలుపలా నశించును.

శి : అట్లు పోవుటకు కారణమేమి ?

గు : చిత్తమే సర్వకారణమూ జగత్త్రయ కారణమున్నూ అది నశించిన సర్వమూ నశించును. కనుక పూర్ణదీక్షపొంది "సుప్తేరుద్ధాయ సుప్త్యంతం" అనగా నిద్రలేచినది మొదలు నిద్రపోయే పర్యంతం మరువకుండా యుండవలెను.

శి : గురునిష్ఠ అనగానేమి ? రాజమార్గ సూచన చేయండి స్వామీ !

గు : పరిపూర్ణసూచన, గురువాక్యముచే సతతము మరువకుండా జ్ఞప్తియందుంచుకొంటూ, గురువాక్యము రీత్యాలేదని, వదలిన దానిని వదలి, నిశ్శంశయులై యుండుటే గురునిష్ఠ, యిదే రాజమార్గ సూచన.

శి : పరిపూర్ణము ఎటువంటిది ? అది నిత్యమా, యనిత్యమా, నిత్యా నిత్యమా ? అట్లే భావమా, భావాభావమా ? బాహ్యమా, అంతరమా, బాహ్యాభ్యంతరమా ? చలమా అచలమా, చలాచలమా, వ్యాప్తమా అవ్యాప్తమా, వ్యాప్తా వాప్తమా ?

గు : ఏదిన్నీ కాదు (1) అది పదార్థమైతే నిత్యానిత్యముల నిర్ణయముండును. (2) అది ఏద్వంద్వమూ లేనిదికనుక ద్వంద్వములలోనిది ఏదీచెప్పరాదు, (3) ఉభయత్వము చెప్పుట అనుభవదూరము (4) యిట్టిదని చెప్పేవాడేలేడు. (5) వాక్కుచే వర్ణించుటకు వీలులేనిది (6) ఏనిర్ణయములూ దానికి లేవు. కనుక అది ఏదికాదు.

శి : అట్లైతే అది కేవలం అభావ పదార్థమేమో తెలియటం లేదు.

గు : అది ఘట పటాదులను గ్రహించినట్లు భావగ్రాహ్యము కాదు. శశవిషాణమువలె అభావమూ, కాదు. జగద్విరుద్ధం కనుక భావాభావమూ కాదు.

శి : ఆ పరిపూర్ణమున కేమి గుణము ? లేక నిర్గుణమా ?

గు : అదొక గుణమూకాదు గుణముల కాకరమైన నిర్గుణమూ కాదు.

శి : అచలమని అందరూ అంటూ ఉంటే, అది అచలంకూడా కాదంటున్నారే ! ఎందుచేత?

గు : దానిది శిలావృక్షాదులవంటి అచల స్థితికాదు. శిలలను దేశాంతరములకు తరలించవచ్చును. కదలించవచ్చును వాయువు వృక్షాదులను కంపింపచేస్తూవున్నది. పరిపూర్ణ మట్టిదికాదు. మరిన్ని చలించే లక్షణముగల ఏ వస్తువునకైనా ఉనికి అనేది నిశ్చయంగా వుంటేగదా అచలమనే సాపేక్షికపదం ప్రవర్తిస్తుంది ? చలించేదే లేదు గనుక అచలమనే పేరు పనికిరాదు -

శి : అది అంతటా వ్యాపించియున్నదంటే విప్రతిపత్తి (ప్రత్యవాయము) ఏమి ?

గు : అది దేశకాలాతీతము 'అంతా' అని చెప్పబడే దేశమే లేనపుడు అంతటా పరిపూర్ణం వ్యాప్తమై యున్నదని వర్ణించడానికి ఎట్లు వీలగును ? అది తప్ప మరొకటిలేనే లేదు. గనుక వ్యాప్తమనికూడ చెప్పరాదు.

శి : అయితే పరిపూర్ణమని పేరెట్లా వచ్చింది ?

గు : లేనియెరుక (తాను) కాని దానికి గుర్తుకొరకు పరిపూర్ణ మనీ, బట్టబయలనీ యిత్యాది పేర్లు పెట్టేరు.

శి : లేనెరుక అని అంటున్నారు అసలు దానికి పుట్టుకంటూ వున్నదంటారా ? లేదంటారా?

గు : యెరుక యెప్పుడూ లేనిదే లేనికల తోచినది. అంతేగాని పుట్టనేలేదు.

శి : యెరుక పుట్టకనేపోతే వున్నదంతా పరిపూర్ణమే గదా !

గు : నీప్రశ్నలో 'అంతా అనే దృష్టి పోనేలేదు. యింకా 'అంతా' ఏమి ? అంతటా ఏమి ? అన్నీ ఏమి ? ఎరుక వల్లనే అన్నీ తోస్తున్నాయి. అహంకారము (ఎరుక) అనే తెరదీస్తే యింకా "అంతా" ఎక్కడుంది ? పరిపూర్ణము తప్ప రెండవది లేనేలేదు దృక్ దృశ్యవివేకులకు దూరంగానే వుంది ఎరుక ఎప్పుడూ పుట్టలేదు.

# పరిపూర్ణబోధ రాజయోగ సిద్ధాంత -శిరోభూషణం

### (గురుశిష్య సంవాదరూపం)

## సజాతీయ విజాతీయ స్వగతభేదములు

గు : పరిపూర్ణము, సజాతీయ విజాతీయ స్వగతభేదములు రహితమైంది.

శి : అమూడు భేదములెట్టివో దృష్టాంతరూపంగా సెలవీయండి స్వామి !

గు : రెండు రావిచెట్లు (జాతి వకటైనా) ఒకదానివలె నొకటుండదు ఒకటి స్థూలముగా మరొకటి సూక్ష్మము కావచ్చును. యిది సజాతీయభేదము.
రావిచెట్టు వేపచెట్టు విజాతికనుక యీ రెంటి భేదము విజాతీయభేదము.
స్వగత భేదమనగా ఒక్క చెట్టుయందే గల తరుశాఖ పత్రపల్లవ పుష్పఫలాది బేధముగాని ఒకశరీరమందలి కరచరణాది భేదములు స్వగతభేదమనబడును.

శి : పరిపూర్ణమందీ త్రివిధభేదము లేవనుటయెట్లు ?

గు : పరిపూర్ణము స్వతస్సిద్ధమైనది, దానివంటిది రెండోది లేదు. కనుక సజాతిభేదములేదు. దాని కన్యమగు పదార్థమేలేదు. గనుక విజాతిభేదమున్నూ లేదు.

శి : స్వగతభేదము యెట్లు లేదుస్వామీ !

గు : పరిపూర్ణము నిరాకారము, నిరవయము.ఒకే దేహ మందుకరణచరణాది అవయవభేదములున్నట్లు పరిపూర్ణ మందు లేవు. ఆకారమే లేనిదానికి అవయవభేద మెట్లుండును ? కనుక దానియందు స్వగతభేద మసలే లేదు. అన్ని భేదములు యెరుకయందే.

శి : ఎరుకనేదిన్ని ఒక్కటేగదా, దానియందు అనేక భేదములు ఎందుచేతవచ్చెను ? శుక్లశోణితములు వేరుగా నుండుటవలన నేమో !

గు : అందరికీ రక్త శుక్లములు ఏకమే, కాని అందరికి ఏకతీరు దేహములున్ను గుణములున్నూ యున్నవా ?

శి : నువ్వులు అనేకమైనా నూనెఒక్కటే, గోవులు వేరైన క్షీరములేకమే. దీపము లనేకములైనా తేజస్సు ఏకమేగదా ?

గు : యివన్నియు తెలివిహీనమైన జడవస్తువులు, కాని చేతనులగు జీవులయందు వృత్తి భేదము లెన్నియో గాన వస్తూవున్నవిగదా ! యిందుకు కారణమేమి ?

శి : కాలవైచిత్ర్యముచేత గావచ్చు.

గు : సర్వప్రాణులకు కాలమేకమే కనుక యీ భేదములు కాలవైచిత్ర్యముచేత వచ్చినవని చెప్పరాదు.

శి : ఐతే, దేశభేదములచేత వచ్చియుండవలె.

గు : ఆపక్షంలో ఒకే దేశమందు పుట్టినవారికెందుకు వృత్తిభేదముండవలె. అట్లే వస్తుభేదము అనుటకూడా పనికిరాదు. వస్తువు ఒకటే అయినపుడుకూడా వృత్తిభేధముంటోంది.

శి : అట్లైతే యీభేదములు గలుగుటకు కారణము బీజధర్మమే ననవలసివుంటుంది.

గు : ఒక్క బీజమందనేకులు పుట్టితే అందరికీ యేకవృత్తి వుంటూ వున్నదా ? అట్లాగే క్షేత్రధర్మమనిన్ని అనరాదు.

శి : పూర్వజన్మమువల్ల అది స్వాభావికముగా వచ్చిందంటే సరిపోతుంది.

గు : పూర్వజన్మ అనేది ఎవరికి లేదు ? అట్లే పూర్వజన్మ కర్మయున్నూ అందరికీ వుండనే వుంటుంది.

శి : పూర్వజన్మము అందలి కర్మ అనగా పని అందర్కీ వున్నదే అయినా పుణ్యపాపములచేత సుఖదుఃఖములు భేదించుచున్నవి గదా !

గు : సుఖదుఃఖములయందు తారతమ్యమున్నా అంతఃకరణ వృత్తులయొక్క భిన్నత్వమునకు కారణమేమి ? అన్నదే ప్రశ్న.

శి : అయితే యీ భేదములన్ని ఎరుకకు స్వాభావికములు అనే చెప్పాలి.

గు : అట్లున్నూ చెప్పగూడదు.

శి : మరింకెట్లా చెప్పవలయును ? నాకంతా అయోమయంగానున్నది తమరే సెలవీయండి స్వామీ ?

గు : ఎరుక లేనేలేదు. కనుక ఏమీ అనరాదు అది మాయ గనుక దాని వైచిత్ర్యం అనంతం.

శి : ఆ విచారమేమో వివరించండి స్వామీ !

గు : మూలము లేదుగనుక ఎరుక ఏమీలేదు. లేనిదానిని వున్నదని విచారించడం భస్మద్రవ్య హోమవత్, (బూడిదలో పోసిన పన్నీరువలె) నిష్ప్రయోజనము. విచారించిన యెరుకను, విడచేవిచారమే చేయవలెను. "దుఃఖధ్వంసో మోక్షః" అనే న్యాయంచేత దుఃఖధ్వంసము చేయవలయును !

శి : దుఃఖమును ధ్వంసముచేయుట ఎట్లు స్వామీ ?

గు : "గంగాయాంఘోష మిత్యత్రగంగా తీరేఘోషః" (అనగా గంగలో గొల్లపల్లె అంటే గంగాతీరమందున్న గొల్లపల్లెను జహల్లక్షణముచే గ్రహించినట్లు) ఇతిన్యాయేనా, దుఃఖధ్వంస మన్నప్పుడు దుఃఖకారణమైన ఎరుక నాశనమని, ఎరుక నాశనమే మోక్షమని గ్రహించవలెను

శి : ఎరుక నాశన మెవరు చేస్తారు ?

గు : ఎరుకే చేసుకొనును. దక్షయాగమందు పార్వతీదేవి తనయోగాగ్నిచేత తన్ను తానే దగ్ధముచేసుకొన్న విధంగా.

శి : ఎరుక యెటువంటిది ?

గు : ఎరుక యెన్నో అయి తోస్తున్నది నాటకశాలయందు దీపమువలె అన్నిటిని ప్రకాశింపజేస్తూ అన్నిటికి కారణమైవుండును. కాని కంసాలవాని సుత్తి అన్నిటినీ సాగకొట్టి తానుమాత్రము యేలాగున సాగదో అలా కారణమైనప్పటికీ కారణం కానట్లుగానే వుండును.

శి : అసలు అన్ని ఆ ఒక్క యెరుకేగదా ?

గు : ఆఒక్క యెరుకే చిజ్జడాత్మకముగాయున్నది. అదే మూలమాయ, అదే ఆత్మ.

శి : మీరిట్లా అంటున్నారు మతకారు లేమన్నారు ?

గు : ఆ చిజ్జడములు రెంటిలో చిత్తు సత్యమనీ, జడము అసత్యమని అద్వైతులన్నారు.

శి : అద్వైతం ప్రచ్ఛన్న బౌద్ధమని అంటారే కొందరు ! రెంటికి తేడా లేదా ?

గు : అద్వైతులు జీవబ్రహ్మావాదులు, బౌద్ధులు దేహబ్రహ్మావాదులు.

శి : యిందెవరు శ్రేష్ఠులు ?

గు : ఆమర్మము సాకల్యముగా దెలిస్తే, ద్వైతద్వైత విశిష్టాద్వైతులే బౌద్ధులకంటె శ్రేష్ఠులు.

శి : చిజ్జడము లెటువంటివి ?

గు : చిత్తుఅనగా సచ్చిదానందస్వరూపము. జడము, అనృత దుఃఖస్వరూపము.

శి : జడానికి కర్తృత్వాదులు చెప్పితేకర్త లేకనే ఖడ్గములు మొదలైనవి కర్మజరుపవలె, గోడలు, మేడలు స్వతంత్రముగానే తయారుకావలె.

శి : జడములుకూడా కార్యములు చేయగలగడంగలదు. ఎలాగంటే వాయువు జడమైనప్పటికి వృక్షముల పాదుపెకలించుటలేదా ? జలము జడమైనా పర్వతములను కోయుటలేదా ? కనుక జడమైననూ కార్యములు చేస్తూయున్నవి.

గు : చేసినాను, చేయలేదు అనే జ్ఞానము వానియందులేదు ఎరుక అన్నిటినీ గుర్తెరుగుతోంది. కృత్యాకృత్యములీ యెరుకయందే గానవస్తూవున్నవి. కనుక జడమునకు కర్తవ్యము చెప్పకూడదు.

శి : అయితే చిత్తునకు కర్తవ్యము చెప్పవచ్చునా ?

గు : చిత్తు నిరవయముగనుక కర్తవ్యము చెప్పగూడదు.

శి : అయితే అపుడు చిజ్జడముల రెంటియొక్క కూటమికి కర్తవ్యము చెప్పవలసియుండును.

గు : కర్తవ్యము రెంటికీ వున్నది. రెంటికీ లేదు.

శి : అదియెట్లు ?

గు : కరద్వయ సంయోగము (రెండు చేతులు చేర్చుట) వల్ల రెంటికి ధ్వనివుండి రెంటికీ లేనట్లు, ఘంటా దానియందలి బొడ్డూ కలసి మ్రోగినట్లు.

శి : ఈ భావము ద్రాష్టాంతికమున ఎట్లు సమన్వయమగును.

గు : చిత్తూజడమూ కలసి ప్రకృతిపురుషుడై కూటస్థుడై సాక్షియై వున్నది.

శి : యిందేది అనర్థకము ?

గు : చిత్తే అనర్థకము, చిత్తులేకుంటే జడము లేదు.

శి : సరే.చిత్తూజడమూ రెంటివల్ల ఏలా అయినది.

గు : పురుషుడు ఖడ్గముచే శత్రువును జయించినట్టు, తన శరీరము కాచుకొన్నట్టు. సాధనకరణములు (అనగా పనిముట్లు) చేత సిద్ధిచేసుకొనిరి. జడముచేత కార్యముగాదు. స్వతహాజడమైనది కార్యము చేయడం విరుద్ధము.

శి : జడము లేకుంటే చిత్తుకు సామర్థ్యము లేదా ?

గు : వున్నది. ఎలాగంటే - శిష్యులు లేనపుడు ఉపాధ్యాయుల విద్య ప్రకటము కాదుగాని వారివద్ద విద్యయే లేదనరాదుగదా ! కనుక ఆత్మసామర్థ్యంవల్లనే సమస్తమున్నూ ప్రవర్తించుచుండును.

శి : రోగము వచ్చినపుడు యీ ఆత్మసామర్థ్యము వున్నది గదా పని యెందుకు చేయలేదు?

గు : యెరుకకు అచ్చంగా కర్తవ్యమూ సామర్థ్యమూ లేవని ఇదివరకే చెప్పినాముగదా ! "ఆసుప్తైరామృతే కాలేనయం వేదాంత చింతయేత్" అనే న్యాయంగా నిదురవచ్చువరకు, తాను చచ్చువర్కు యీ విచారమే చేయవలెను.

శి : మంత్ర, యంత్ర, తంత్రాదుల మాటయేమి ?

గు : వానివల్ల యీవిచారమెప్పట్కి సంభవించదు.

శి : ఎందుచేత ?

గు : అమావాస్య రాత్రి, దారిలో మనుష్యులువస్తే ఎవరో ఎట్లు తెలియదో, యిది ఆవు యిది మహిషము అని ఎట్లు తెలియదో అట్లే, అజ్ఞానము తొలగదు. కనుక కర్మల వల్ల ముక్తి చెందదు.

శి : కర్మ, విచారమూ యీ రెండూ వుంటేనో ?

గు : కాలమంతా కర్మలతోటేపోయె కర్మకు అంతులేదు. కర్మధర్మములే అహంకార మమకారములకు కారణము కనుక

శ్లో॥ నముక్తికర్మధార్మభ్యాం, నముక్తిర్యాగ యోగయోః
నముక్తిర్ జ్ఞానమార్గేణ, ముక్తిర్బ్రాజ ధ్యానయోః

శి : ముక్తిఏది ? బంధమేది ?

గు : ముక్తియనగా విడువడము. బంధమంటే విడువకపోవడము. తన్ను విడువడమే ముక్తి.

శి : తన్నుతాను ఎలాగున విడచును ?

గు : శివుని నేత్రముచేత మన్మథుడేలాగున నశించెనో అలాగే గురుని కరుణావీక్షణముచేత ఎరుకనే మన్మథుడు భస్మమగును.

శి : ఐనా ఎరుక ప్రత్యక్షముగా వున్నదే !

గు : ఎరుక పంచప్రత్యక్షములూ కాదు

శి : పంచప్రత్యక్షములూ ఏవేవి ?

గు : 1) ఉద్భూత ప్రత్యక్షము, 2) అనుద్భూత ప్రత్యక్షము, 3) భావాభావ రహిత ప్రత్యక్షము, 4) సంబంధ ప్రత్యక్షము, 5) విరోధ ప్రత్యక్షము.

శి : వానిని విచారించండి స్వామీ ?

గు : ఎరుక ఒకదానిచేత పుట్టినదికాదు అనాది విచారిస్తే నామరూపాలచేత కానరాదు. కనుక వుద్భూత ప్రత్యక్షమని అనరాదు.

శి : అనుదుద్భూతమంటేనో ?

గు : సర్వమునందూ వున్నట్లు వుందిగదా ! సర్వప్రపంచరూపంగా పరిణమించినది. గురుకృపచేత నశించిపోవు చున్నది. కనుక అనుద్భూత ప్రత్యక్షమనుటకున్ను వీలులేదు.

శి : భావాభావారహితప్రత్యక్ష మంటే ?

గు : దిక్కులుభావాభావ రహిత ప్రత్యక్షము ఎరుక అట్టిది కాదు ఎరుక సర్వానికిమూలం. కాని, విచారిస్తే గురు కృపచేత ఎక్కడాలేదు.

శి : సంబంధప్రత్యక్షమంటే ఏమి ?

గు : కాష్టగ్నివత్, అంటే కర్రయందుదాగియున్న నిప్పు సంబంధ ప్రత్యక్షం. ఎరుక నిరాధారము. పైగా దాని వంటిది రెండవది లేదు. కనుక సంబంధప్రత్యక్షము కాదు.

శి : విరోధప్రత్యక్షమంటే ఏమో వివరించండి స్వామి !

గు : ఘటధర్మము పటమందుగాని, పటధర్మము ఘటమందుగాని యుండుటకు విరుద్ధమే. కుండకూ బట్టకూ ఏమీ సంబంధం లేదుగాని విచారిస్తే రెండూ ఒకటే. ఏట్లా అంటేకుండకు కారణం మట్టి, బట్టకు కారణమగు ప్రత్తి యుత్పత్తికిన్ని అమట్టే కారణము. ఆవిధంగా చెప్పదామంటే, నిశ్చయంగా ఫలానా కారణమంటూ చెప్పడానికి వీలులేదు. కానిసమస్త రూపాలుగా యిదే పరిణమించింది. కనుక విరోధప్రత్యక్షమని అనుటకున్నూ వీలులేనిది

శి : ఎరుక ఎట్లులేకుండాపోవును ?

గు : వినరాని గురువాక్యంచేత కానరాని పరిపూర్ణమును మనస్సులేక మననంచేస్తే సర్వభ్రాంతిరహితం.

శి : ఇదేదో పొడపుకథలావుందే !

గు : అంటే, వాక్కుచే వచింపరానిది కంటితో చూడరానిది మనస్సుచేత మననం చేయరానిది అని అర్థం. అందుకే శ్రుతి "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతినో మనః" అన్నది పరిపూర్ణమట్టిది.

0 ----- 0

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురుశిష్య సంవాదరూపము

## జన్మఫల ప్రకరణము

శి : మానవులు పొందే ఫలము లెన్ని విధములు స్వామి !

గు : 1) విద్యాఫలము, 2) అవిద్యాఫలము, 3) విద్యా విద్యా ఫలము, 4) తుర్యఫలము అని నాల్గు విధములు.

శి : ఒక్కొక్క దానిని వివరించండి ప్రభూ.

గు : వీనిలో ఉత్తమఫలము విద్యాఫలము ఎట్లనగా మంత్ర, లయ, హఠ రాజయోగములు, స్వరయోగము, భక్తి జ్ఞానయోగములు మొదలగువాని ద్వారా బ్రహ్మైక్యజ్ఞానము పొంది తన్ను బ్రహ్మస్వరూపముగా గుర్తు ఎరుగుటయే జన్మించినందుల కుత్తమఫలము.

శి : అవిద్యాఫలమేది ? అందుత్తమ నీచఫలములెవ్వి ?

గు : ఈ ఫలములు అనేక విధములు. ఉత్తమలోక సుఖభ్రాంతిచే యజ్ఞ, యాగ, యోగ పూజాకీర్తనాదులచే అయాలోకములు పొందుట, ఆ పుణ్యము క్షీణించిన "క్షీణేపుణ్యం మర్త్యలోకం విశంతి" అనే విధంగా తిర్గి భూలోకమున జన్మించుట, యిది అవిద్యాఫలములో వుత్తమం ఇహలోక సుఖములాశించి పాపభయములేక, బ్రహ్మహత్య సురాపాన స్వర్ణస్తేయము లొనరించుట తత్ఫలితంగా నీచయోని ప్రాప్తిచెందుట నీచఫలములు.

శి : విద్యావిద్యా ఫలమెట్టిది ?

గు : పుణ్యముకొర్కై యజ్ఞయాగాది కర్మములు చేస్తూ మోక్షంకొర్కై జ్ఞానమార్గావలంబియై ఉన్నావారు విద్యా విద్యా ఫలములు పొందును.

శి : యీ విద్యావిద్యా ఫలములలో ఉత్తమనీచ ఫలములు ఏమి ?

గు : యీ పుణ్యపాపములచే వచ్చు సుఖదుఃఖములు ప్రాపంచిక పారమార్థిక బేధములచే రెండు విధములు.

శి : అది ఎట్లు ?

గు : స్వర్గ, వైకుంఠ, కైలాసాదులలో పారమార్థిక సుఖము ఇది జప హోమదాన స్తోత్రాదులచే లభించును. స్త్రీసంబోగ, దుకూల (వస్త్ర) ఆభరణాదులచే పొందునవి పుత్ర మిత్ర కళత్రాదుల మైత్రివలన కలుగునవి, లోక సుఖములు ప్రాపంచిక సుఖములు. అట్లే యమలోక ప్రాప్తి పారమార్థిక దుఃఖము. క్షుత్పిపాసలు, అధివ్యాధులు, పుత్రమిత్ర

కళాత్రాదుల మొదలగువానివలన కలిగే దుఃఖము, ప్రాపంచిక దుఃఖము, వీనివలన ఉత్తమ మధ్యమ, కనీస, సుఖదుఃఖములు ప్రాప్తించును.

శి : ఇక, తుర్యఫలమంటే ఏమి ?

గు : అది ఉత్తమోత్తమ ఫలము, మహాముఖ్యము, సర్వాతీత ఫలము.

శి : సర్వాతీతమైతే దానిని ఫలమనవచ్చునా ?

గు : ఫలమని ఎందుకు అన్నారంటే

శో॥ ఫకారోఫల జ్ఞానస్వాత్, లకారో లయముచ్యతే।
విద్యావిద్యాద్వయంనాస్తి తదేవ పరమం ఫలం॥

తా॥ ఆ ఫలజ్ఞానము కల్గితే సర్వ ద్విపుటుల, త్రిపుటులు రహితమైనస్థితి ఏదో అది తేట తెల్లము. ఆ ఫలము విద్యావిద్యా ఫలములు రెండుకానిది; రెండు లేనిది అదే పరమ ఫలము.

శి : దానిని పరమఫలమని యెందుకన్నారు ?

గు : సాధనసాధ్యమైనది ఫలము. సాధనాంతర నిరపేక్షమైనది పరమఫలం. ఇంతకంటె యెక్కువైన ఫలము ఎక్కడా లేదు. రాకడ పోకడలనే రాపిడి బాపే పుట్టని చావని త్రోవ. అది చిద్వస్తురహితమైన త్రోవ.

శి : ఏమి ! ఆ ఒక్కదానియందు ఉత్తమ, మధ్యమ, కనీస ఫలములంటూ యిన్నీ ఉన్నాయా?

గు : పరిపూర్ణము ఫలమే కాదన్నానుగదా ! వ్యవహారార్థం దానిని తురీయఫలమని పరమఫలమని అన్నాము. తురీయ మనేశబ్దానికి ఇదమిద్ధమని చెప్పరానిది; అని తాత్పర్యము ఏ ఫలములున్నా ఎరుకయందే ఉన్నాయి.

శి : ఎట్లావున్నాయిస్వామి ? ఒక్కదృష్టాంతం సెలవీయండి.

గు : అరటిచెట్టు యందు ఉత్తమ, మధ్యమ, కనీసాది ఫలములున్నట్లుగానే, ఎట్లంటే - అరటిపండు వుత్తమోత్తమ ఫలము - పుష్పవర్ణములు (పూలు ఆకులు) ఉత్తమఫలము ఊచ (దూట) అధమఫలం, గడ్డ (దుంప) అధమాధమ ఫలము. ఆవిధంగానే ఒక్క ఎరుకయందే యిన్ని ఫలములున్నవి.

శి : తుర్యఫలము లేక పరమఫలము అయినటువంటి వుత్తమోత్తమ మనదగిన పరిపూర్ణ బోధయుండగా యితర బోధలకెందు కందరూ అపేక్షిస్తున్నారు.

గు : శ్లో॥ శాస్త్రీషుహీనాశ్చపురాణ భట్టాః
పురాణహీనక్కవయోభవంతి,
కవిత్వహీనాః కృషిమాశ్రయంతిః

భగ్నేకృషే భాగవతాభవంతిః అని చెప్పబడిన పద్ధతిగా గతిలేనమ్మకు గంజే పానకమన్న సామ్యం - చేతిలో ప్రసాదం వుంటే మోచెయ్యి నాకిన చందము, బంగారం లేకుంటే యిత్తడి సొమ్ములు పెట్టుకొన్న విధము.

శి : యోగీశ్వరులు, సన్యాసులు, సర్వసంగ పరిత్యాగులు ఎంతోమంది వున్నారు. వారెవర్కీ ముక్తిలేదా ?

గు : ఎంత తెలసినా ఎన్ని సాధనలు చేసినా యీ మార్గము తెలియకుంటే రాకడపోకడలు తప్పవు. చెరుకు అంతా తింటానని పందెంకట్టి కణుపు తినలేకున్నా ఓటమే. అట్లే జన్మకారణము యేమాత్రం మిగిలియున్నా ముక్తి లేనట్లే పామును కొట్టకుండానే వుండాలి. కొట్టితే చావకొట్టితేకాని లేకుంటే ప్రాణహాని చేయును. యాగమందు శివుణ్ణి పిలువక సర్వదేవతలను దక్షుడు పిలిస్తే ఏలాగున అయెనో, అలాగే అన్యమార్గముల వల్ల జన్మ రాహిత్యం సిద్ధించదు.

శి : అన్యమార్గములన్నీ వృథాయేనా ?

గు : కాదు. వారు పామరులకంటె వుత్తములే. బ్రహ్మము వేరే లేదు. ప్రత్యక్షంగావున్నది. ఈ దేహమే అనే దేహబ్రహ్మవాదులగు చార్వాకబౌద్ధులకంటె జీవుడే బ్రమ్మమనే అద్వైతం, జీవుడు పరమాత్మకు దేహమనే విశిష్టాద్వైతము లేక పరమాత్మ ప్రభువు. జీవాత్మ సేవకుడు అనేద్వైతము గాని వుత్తమమే. తురకలు లేనివూరిలో దూదేకులే షేక్ కులస్తులన్నట్లు, అంతేగాని పరిపూర్ణబోధతో ఏబోధలు సాటిరావు.

శి : కారణమేమి ?

గు : ఈ పూర్ణబోధచేగాని ఎరుక అనే తెరతెగదు ఈబోధ ఝుంఝూ మారుతమువంటిది.

శి : మతములవారిలో మాత్రము గురువులులేరా ?

గు : గురువెంతటి వాడైతే శిష్యుడంతటివాడే అగును గురువునకు రాని విద్య శిష్యునకు ఎలాగు ఉపదేశించును? ఎటువంటి గురువైతే అటువలెనే చేసును యెరుక రహితపరచుకున్న గురువు అయితేనే శిష్యుని ఎరుక రహితం చేయగలడు.

శి : గురుబోధచే యెరుకరహితము కాగలదుగదా యిక యెరుక విచారమెందుకు ?

గు : అగ్నియైనా ముట్టుకుంటేనేకాని కాల్చదు. పరిపూర్ణములో వస్తూపోతూ వున్న దానిని, యెరిగితేగాని యెరుకను విడువజాలడు.

శి : కనుక, జన్మరహితము గోరువాని కర్తవ్యమేది ?

గు : నీచాశ్రయంన కర్తవ్యం కర్తవ్యం మహదాశ్రయం అని వున్నది కనుక పరిపూర్ణుడైన గురువుచేత పరిపూర్ణమును గుర్తెరుగవలె పిదప యెరుకను విడువవలె.

శి : ఎరుకవుంటే మాత్రమేమి ?

గు : "నీచాః కలహమిచ్ఛంతి సంధియిచ్ఛంతి సాధవః" కారణమేమంటే, నీచోన్నతములుగా నుండే యెరుక యున్నంతసేపు కలహమే, యిచ్చయించుచుండును. కనుక ఎరుకనే అహంకారమును విడువవలెను.

శి : నాలుకయుంటే పదార్థములరుచి తెలుసుకోగల్గునట్లు యెరుకయుంటేనే అన్ని తెలియవచ్చునని, ఎరుకలేకుంటే ఏమీ లేదనిన్నీ కనుక ఎరుకయుండుటయే నయమనీ, కొందరు అంటున్నారు.

గు : క్షుధ (అనగా ఆకలి) నివారణే ప్రధానము రుచియే ప్రధానమంటే నాల్కయందే ఉంచుకోకూడదా ? ఎందుకుమింగవలె ?

శి : మ్రింగకుండావుంటే క్షుధనివారణగాని, దేహపుష్టిగాని కలుగదు గదా !

గు : కనుక నాలుకచే రుచి ఎరుగుట ఎట్లు ప్రధానముకాదో, అట్లే ఎరుకవల్ల అన్నీ తెలుసుకొనుటయు ప్రధానం కాదు. ఎరుకను తీసివేయడమే ఉత్తమము.

శి : అట్లా ఆ యెరుకను తీసివేయకపోతే ఏమి ?

గు : కొట్టకొన (చివరి సిద్ధాంతం) కానక, పుడుతూ గిడుతూ ఉంటారు. యుక్తులు చెప్పకొని సంతోషించుకొంటూ ఉంటారు.

శి : శాస్త్రజ్ఞులైన వారుకూడా ఎరుకను ప్రతిపాదింతురు కదా !

గు : కాని స్వానుభూతిలేక వాదిస్తారు. ఎంతవారికి తెలియదు యెరుక యొక్క స్వరూపజ్ఞానముకూడా అనేక జపసంసిద్ధివలన గాని సంభవించదు.

శ్లో॥ బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రద్యతే
వాసుదేవ స్సర్వమితి, సమహాత్మా, సుదుర్లభః

ఎరుకయొక్క అనుభవ జ్ఞానము కూడా దుర్లభమని చెప్పబడినది. పూర్ణబోధయో అత్యంత దుర్లభము. దానికి సాటిది ఏదీ లేదు.

శి : ఇన్నిసార్లు ఏల చెప్పవలెను ? స్వామీ ఒక్కమాట చాలదా ఏమి ?

గు : వృత్తులు నీళ్ళమీద పాచివంటివి. కొన్ని చోట్ల ఈ పాచిని ఆవలికి త్రోసి నీళ్ళు ముంచుకుంటే స్వచ్ఛముగానే ఉండును. కొన్నిచోట్ల గెంటనక్కర లేకుండానే పాచి వేరుగా శుద్ధజలము వేరుగా గానవస్తూనే వుండును. కొన్ని చోట్ల నీరు ముంచుకొనుటకు కూడా పాచి ఎడమివ్వక వడభోస్తేనేకాని పోనేపోదు. కాబట్టి ఎన్నో రీతులుగా శ్రుతిస్మృతులచేత ఈ తీరు చెప్పితిమి. దృఢము కొరకు లేనివి చెప్పినా లేవు. వున్నా, కన్నా, విన్నా లేదన్నా అది లేనేలేదు, దృశ్యపదార్థముగాని, దృక్కుకాని లేనేలేవు.
కృతి - దృశ్యరూపంచ, దృగ్రూపం సర్వంశ శవిశాణవత్ గనుక ఎరుక ఎప్పుడూ పుట్టనేలేదు.

# పరిపూర్ణబోధ సిద్ధాంత శిరోభూషణం

## గురుశిష్య సంవాదము

## పరిపూర్ణము నిర్విషయము

గు : శ్లో॥ ఆదిమధ్యాంతరహితం అనిర్వాచ్యమనామయం
నిశ్చలం నిర్మలాబాహ్యం సర్వపూర్ణం సదాప్రభుం

శి : ఇటువంటి పరిపూర్ణము దృక్‌కు విషయమా కాదా ?

గు : పరిపూర్ణము దేనికీవిషయము కాదు. విషయమగునని అనరాదు.

శి : ఎందుకు అనరాదు ?

గు : విషయమంటే పరిపూర్ణమునకు హానివచ్చును.

శి : ఎట్లు హానివచ్చును ?

గు : "యద్దృశ్యం తన్నశ్యం" అని చెప్పబడినది కనుక పరిపూర్ణము దృక్కుకు విషయమైన దృశ్యమని అనరాదు.

శి : విషయము కాదంటే అది శూన్యము అనవలసియుండును.

గు : అట్లు అనుట లోకవిరుద్ధము. ఏలననగా అది శూన్యమే అయితే శాస్త్రము, గురూపదేశము ఏమియు అక్కరలేదుగదా ?

శి : పోనీ, మనస్సు బ్రహ్మమును గుర్తెరుగును అని చెప్పవచ్చునా ?

గు : జడమైన మనస్సు బ్రహ్మమును ఎట్లు గుర్తెరుగును ?

శి : నిర్మలము కనుక గుర్తెరుగును.

గు : నిర్మలములైన ముకురాదులు గుర్తెరుగుచున్నవా ?

శి : చైతన్య అంశ మనస్సునందునూ కలదు. కనుక మనస్సు గుర్తెరుగుచున్నదని ఏల అనరాదు?

గు : సూర్యాంశగలదీపము సూర్యుని ప్రకాశింపచేయగలుగునా ? మరిన్నీ పరిపూర్ణము యొక్క అంశమనస్సునందు వున్నదని చెప్పరాదు. పరిపూర్ణము అవిభాజ్యము.

శి : "మనసై వానుద్రష్టవ్యం" అనీ, 'ఆత్మావారేద్రష్టవ్యో, అని శ్రుతులు చెప్పుటలేదా ?

గు : ఆ శ్రుతులు జ్ఞేయబ్రహ్మమును గూర్చి మాత్రమే చెప్పినవి. పరిపూర్ణ పరబ్రహ్మం విషయంలో ఆశ్రుతులు వర్తించవు.

శి : పోనీ బ్రహ్మము స్వసంవేద్యుడు అంటేనో ?

గు : తన ముఖమును తాను ఎన్నడైన చూచుకొనగలడా ?

శి : దర్పణ సహాయముచేత తనముఖమును తన నేత్రముల చేతనే చూడనగునుగదా ? అంతఃకరణయందట్లే తన్నుతాను గుర్తెరుగ వచ్చునుగదా ?

గు : అది పరిచ్ఛిన్నముగనుక అంగీకారము. బ్రహ్మము అపరిచ్ఛిన్నము కనుక అలాగున చెప్పరాదు.

శి : అయితే పరిపూర్ణమును ఏమనవలెను ? దృశ్యము అనవలెనా ? అదృశ్యమనవలెనా?

గు : పరిపూర్ణము దృశ్యమూ కాదు. అదృశ్యమూ కాదు. ఒక పక్షములో దృశ్యము అని చెప్పిననూ ఏలోపమూ లేదు.

శి : మళ్ళీ అదేమిటి ? యదృశ్యం, తన్నశ్యం అని మీరే అన్నారుగదా ! ఏ లోపము లేదంటారేమి?

గు : మీరు "మిగతావన్నీ జడములు గుర్తెరిగే తెలివి యొక్కటే చిత్ స్వరూపము" అన్నారు కనుక మీ వాదనకు లోపము వచ్చును. మాకు దృక్కూ దృశ్యమూ రెండూ ఒక్కటే. పరిపూర్ణము చిత్తూకాదు. జడమూకాదు. కనుక ఏలాగన్ననూ నిర్భయమే !

శి : పరిపూర్ణమును జడమని ఏలచెప్పరాదు ?

గు : "జడానామేవ జన్యత్వమితిస్వాభావికోగుణః" అని వున్నది పరిపూర్ణము జన్యముకాదు. కనుక జడమూ కాదు. సర్వమును తాను ప్రకాశింపచేయదు. కనుక చిత్తూకాదు, ఈ రెండూకాని పరిపూర్ణమును చిత్తుగుర్తెరుగ జాలదు.

శి : ఎందుచేత గుర్తింపజాలదు

గు : పరిపూర్ణమందు పంచతన్మాత్రలు లేవు కనుక అక్కడ నిలవలేదు. నున్నటి పర్వతము మీదికి నరుడు ఎక్కలేనట్లు.

శి : పరిపూర్ణము గోచరించబోదా ?

గు : ఏ యింద్రియమునకునూ గోచరించబోదు.

శి : అయితే వున్నదని ఏమి ప్రమాణము ?

గు : శ్రుతి "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ" దానిని చూచే శక్తి దీనికి లేదు. చూడరాని దానిని చూడకపోతే చూచేదే వుండదు. సింహస్వప్నమువలె.

శి : ఎరుక చూచిపోయెనా ? లేక చూడకపోయెనా ?

గు : చూచింది. చూడలేదు. (చూచేవస్తువే చూడబోతే ఏమీలేదు)

శి : అది ఏలాగూ ?

గు : కల, వాయువులుదృశ్యమానమై ఏలాగున కానరావో అలాగే పరిపూర్ణము దృశ్యమానముకాదు. అయినట్లు తోచును అంతే, వంధ్యాపుత్రుడు ఏమిచేసినాడంటే ఏమిలోపము ? పరిపూర్ణము దృశ్యమనిన్నీ, అదృశ్యమనిన్నీ, ఈ లేనియెరుక మాటలు ఏమి నమ్మిక ? చూచినాను అని అనుకోవడం, లేదనుకోవడం, దీని ధర్మము.

శి : తమ అభిప్రాయం దృష్టాంతములచేత శెలవియ్యండి స్వామీ !

గు : ఏనుగు అంత్యకాలమందు సింహము కలలో వచ్చునట్లు ఏలాగున తోచునో, అలాగే పరిపూర్ణముతోచినట్లు భ్రాంతివార్తేకాని వాస్తవముకాదు. వెరపించపోయి తానే వెరచిన చందముగా పరిపూర్ణము చూడబోయి ఎరుకతానే లేకపోవును.

శి : ఇంకా కొంచం విపులంగా చెప్పండి స్వామీ !

గు : శశిశృంగము ఎంతమందిని హతముచేసెనంటే ఏమిలాభము ? అబద్దీకుడు ఏమిఅంటే ఏమి ప్రమాణము ? చూచినాననడం చూడలేదనడం దీని వికారమేగాని దానికి ఏవికారము లేదు. యిది లేనిది కనుక దానిని ఏమీ అనరాదు. ఈమాట వాస్తవము. అది లేనిది కాదు. దానికి ఏమియు లేదు.

శి : పరిపూర్ణము విషయము అనుకుంటే బాధఏమి ?

గు : మనస్సునందు ఆలోచనచేత (వూహాగానముచేసి) రాజు యొక్క సకల సంపదా తనకు వచ్చిందని సంతోషించితే నిజంగా వచ్చినట్లా ? అలాగే పరిపూర్ణము తనకు గోచరించనదన్నా అంతే నిజము.

శి : దృశ్యము పంచతన్మాత్రసహితము అగునేగాని, దృక్ పంచతన్మాత్రరహితంకాదా ? పంచతన్మాత్రరహిత మయినదే పరిపూర్ణమని మీరంటే దృక్కే పరిపూర్ణమని తోస్తుంది.

గు : కాదు కాదు. తాను తన్మాత్రసహితుడే. దృగ్దృశ్యములు రెండునూ తానే కనుక తన్మాత్రసహితమైన తానైన ప్రపంచమే దృక్కుగానూ, దృశ్యముగాను తనలో తానే భావిస్తోంది. తన్మాత్రహీనమైన, పరిపూర్ణము, తనకు దృశ్యము కాదు.

శి : దృశ్యము అయినట్లుగా ఎందుకు తోస్తున్నది ?

గు : భ్రాంతిచేత, దరిద్రునికి మట్టిగిన్నె లేనప్పటికి సువర్ణపాత్రను అపేక్షించినట్లు, స్వప్నమందు దరిద్రునికి రాజు తన వాకిట్లో కావలియున్నాడని దృశ్యమై మేలుకొంటే వాస్తవమైనదా? అదీ అలాగే.

శి : ఈ లేనియెరుక చిత్తా ? జడమా ?

గు : రెండూ ఎరుకే. ఒకటి లేకుంటే రెండవది లేనేలేదు.

శి : కొంచెం విశదంగా చెప్పండి స్వామీ !

గు : వృక్షములన్నీ కూడితేనే వనమైనట్లు బీజములన్నీ గూడి ధాన్యమనే పేరువచ్చినట్లు, గృహములన్నీ గూడి గ్రామమనే పేరు వచ్చినట్లుగానే చిజ్జడములు కలసినదానికే ఎరుక అనే నామ ధేయము. వేనికవి విడతీస్తే వానివాని పేర్లే లేవు. చిజ్జడములు వేరే విభజించటానికే వీలులేదు. ఒకటి విడవడానికి, ఒకటి విడువకుండా వుండటానికి వీలులేదు. విడచినచో రెండూ విడువవలసినదే, ఈరెండూ విడిస్తే రెండూగాని పరిపూర్ణమే వుండును.

శి : ఈ చిజ్జడములు రెండూ విడువకపోతే పరిపూర్ణముండదా ?

గు : ఉన్నదే అది. చిజ్జడరూపమైన ఎరుక లేనిదే ఆరోపితము చేయబడినది.

శి : లేనివస్తువు ఏలాగున తోచగలదు ? లేనివస్తువునకు పరిపూర్ణ మెట్లుతోచును ?

గు : ఎండమావులందు విచారిస్తే లేనప్పటికిన్ని జలము ఏలాగున తోచునో అలాగే పరిపూర్ణమందు యెరుక తోచెను. లేనిది లేకుండాపోతే వున్నపరిపూర్ణమే వుంటుందని వుండచూచు కొనటమేగాని చూచుట ఏమీలేదు; తోచుట ఏమీలేదు ?

శి : ఎరుక తోచబడుట, దేనిసామర్థ్యముచేత ? పరిపూర్ణము యొక్క సామర్థ్యంచేతనా ? లేక ఎరుక సామర్థ్యము చేతనా ?

గు : పరిపూర్ణమున కేసామర్థ్యములేదు. చిత్తుదే. దీనికి ప్రతి యెక్కడాలేదు. దానికీ ప్రతియెక్కడా లేదు.

శి : చిజ్జడములు రెండూకలసియే యెరుక అని సెలవిచ్చినారు గదా ! జడములేకుండా చిత్తు ఏకార్యమైనా చేసేనా ? చిత్తుచేత పరిపూర్ణం తోచినదని చెప్పరాదా.

గు : అట్లు చెప్పరాదు. దారువు సాన్నిధ్యముచేత అగ్ని అన్నిటిని దహించినప్పటికిని ఆసామర్థ్యము అగ్ని దేగాని దాని కాధారమైన శుష్కములదికాదు.

శి : ఆసామర్థ్యము యేలాగు వున్నది ?

గు : రజ్జువుయందు సర్పాధ్యారోప శక్తి వున్నట్లు; ప్రతిబింబ శక్తి ముకరమందున్నట్లు; జడవినోదశక్తి చిత్తుయందున్నది. కనుక చిత్తుయందే చెప్పవచ్చును.

శి : జడసాన్నిధ్యము లేకుంటే చిత్తుయందూ లేదుగదా !

గు : కనుక రెంటియందూ కలదు. రెంటిలో యేదిలేకున్న తోచదు.

శి : యిందుకు కొన్ని దృష్టాంతములు సెలవీయండి స్వామీ !

గు : దీపము, నేత్రము; రెంటిలో ఏదిలేకున్నా అంధకారంలో పదార్థములు యెట్లు గోచరించవో; శుష్కరహితంగా అగ్నిప్రకాశించనట్టు; స్త్రీ పురుషులలో ఎవరు లేకున్నా సంతానోత్పత్తి ఎట్లుకాదో; అట్లే చిజ్జడములలో యేది లేకున్నా రెండోది ప్రకాశింపదు.

శి : ఇది అంతయూ యెట్లు ఆరూఢమగును ?

గు : ఈ బోధ లేకుంటే తెలియదు. గురుబోధకాలమందు తలచినా తలచకున్నా అది అలాగే, విచారించక విచారిస్తే ఏమీలేదు. బోధ లేకుంటే అంతుచిక్కక విరుద్ధంగా నుండును. అట్టి వానికి ఎరుకయందే నమ్మిక.

శి : అట్టి మూఢనమ్మకమేల యుంటుందో ?

గు : నక్కలు, కుక్కలు దుర్మాంసమునకే యాశపడును. సింహమైతే కండ్లముందరవున్నా దానిననికోరదు. గజకుంభస్థలమాంసమునే అపేక్షించును. అలాగే ఈ బోధ గలవారికి, అల్పయుక్తులు, అల్పబోధలు యిష్టంకావు. ఎరుక ప్రతిపాదకమైనవి యెన్నైనా యిష్టంకావు. దుష్టుల ముందు ఈ బోధలు బెడితే శునకము ముందు అమృతభాండముంచినట్లే.

శి : ఈ బోధకలవారిని కొందరు అపహాస్యం చేస్తున్నారే ?

గు : అల్పులుపొగ్గై హాస్యముచేసినా వారి ఆరూఢతను చెడగొట్టలేరు. మసిగుడ్డలో చుట్టినంతమాత్రాన మాణిక్యం యొక్క ప్రకాశముచెడునా ? మంచిగంధపు చెట్టు వేపచెట్లనడుమ నున్న మాత్రమున చెడిపోవునా ?

శి : యితర మార్గములవల్ల మోక్షంపొందలేరా ?

గు : ఈ మార్గంవల్ల భ్రాంతి తెగిపోవాలేగాని యితర మార్గాల వల్ల ఆశేగాని యెప్పటికీ మోక్షమును పొందడు. అరచేతిలోని అన్నపు ముద్దను విడచి మోచేయి నాకినట్లుగా వుంటుంది యీ మార్గమువినా దేనివల్లా కడతేరడు.

శి : ఈ బోధవల్ల భ్రాంతినశించి తాను శాశ్వతముగ మోక్షస్థితి యందుండునా ?

గు : కాదు. ఈ బోధవిచారిస్తే, తానూ తన భ్రాంతీ అంతా తమంతట తామే లేకుండా పోవును. అదే కదా కావలసినది ?

శి : తానుకూడా లేకుండానే యెట్లుపోవును ?

గు : నిశియందు మతాబు వెలిగి సర్వవస్తువులను ప్రకాశింపచేసి, తానూ తన ప్రకాశమూ లేకుండాపోయినట్లుగానే లేకపోవును.

శి : ఈ బోధలేనిచో యేమగును ?

గు : రంగులరాట్నమువలె, కులాల (కుమ్మరి) చక్రమువలె, జనన మరణ ప్రవాహరూపమైన సంసారచక్రమందు మునుగుతూ తేలుతూ వుండును; ఇందుకు సందేహము లేదు. కనుక నిదురవచ్చినదనుక, చచ్చినదనుక ఎరుక వున్నంతసేపు గురువాక్యము మరువరాదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదరూపము

## బోధదృఢీకరణ ప్రకరణం

గు : ఎన్ని విధములచేత ఎంతమంది ప్రయత్నించినా పరిపూర్ణ బోధజ్ఞుల ఆరూఢత చెడదు.

శి : "చెప్పగా చెప్పగా బ్రహ్మకేనా పుట్టురిమ్మ తెగులు" అనే న్యాయంగా చెడిపోకుండా వుండగలదని నాకు నమ్మకము లేదు.

గు : పరిపూర్ణబోధ ఆరూఢమైన స్థితిలో అదియెంతమాత్రం సరికాదు. ఎట్లాగనగా చెఱుకుముక్కలు కొట్టి గానుగ పట్టినా తీపిమానునా ? మంచిగంధపు చెట్టు పగులగొట్టి రాతిమీద అరుగ కొట్టినా దాని పరిమళము పోవునా ? వజ్రమును పరచినచో తత్కాంతి

తప్పునా ? కనకమును కాల్చి సుత్తితో కొట్టినా దాని విలువతరుగునా ? అట్లే పరిపూర్ణ బోధయును ఎంతమాత్రం చెడదు. అల్పబోధ పరునివలె పరిపూర్ణ బోధజ్ఞుడు చెడిపోడు.

శి : పరిపూర్ణబోధయందు ప్రవేశించినవారంతా కృతకృత్యులు కాగలరా ?

గు : "సంశయాత్మ వినశ్యతి" అని చెప్పబడినరీతిగా సంశయం ఎప్పటికి కూడదు. నీరుకారగాకారగా కంటికి నష్టమెలాగో ఇంటికి పోరునష్టి యెలాగో అలాగే అనుమానం ఈబోధ పరునికి నష్టి.

శి : ఈ బోధపరులను యితర మతస్థులు ఎందుకు దూషింతురు ?

గు : కోకిలపిల్లను కాకులు పెంచి దానికి కాకిపలుకులు రాలేదని పొడిచిపొడిచి శ్రమపెట్టినట్లుగా దుర్మార్గులు తమ మతస్థుల రీతిగా వారుకూడా యెందుకు వుండకూడదని వారిని తిరస్కరింతురు; కాని పరిపూర్ణలను వారు ఎంతమాత్రము కదపలేదు.

శి : ఎందుచేత ?

గు : లొంగినవారినే వారు చెడగొట్టగలరు. నిండుగర్భముతో నుండి పరుగెత్తజాలని లేడిని మాత్రమే ఎరుకలవాడు సునాయాశంగా చంపును. బోధయందు కృషిచేయకుండా అరికట్టగలరేగాని బోధదృఢము నాశనము చేయుట వారితరముకాదు. ఈ బోధ దృఢమయినవాడు పర్వతము వానకు వెరవనట్లు ఎవరిమాటలవల్లను సంశయము పొందడు.

శి : తనకే దృఢము కానివాడు గురువై ఈబోధను అన్యులకు చెప్పవచ్చునా ?

గు : చెపితే, తానుగంజి తాగి, కుక్కకు అమృతము పోసినట్లే.

శి : భ్రాంతిరహితము కావాలంటారుగదా ! భ్రాంతిరహితం అయితే ఏమివున్నట్లు ?

గు : లేనిది ఎప్పుడూ లేకపోతే; వున్నది ఎప్పుడూ వుండును. ఇపుడు భ్రాంతిలేకుండా వుంటే ఎప్పుడూ ఏభ్రాంతి లేదు.

శి : ఎరుక వున్నంతమాత్రమున నష్టమేమి ?

గు : ఎరుకను నమ్మి వున్నవారికి ముప్పుతప్పదు. ఎరుక ఎటువంటిది. అంటే అగ్నితో నిండిన కుండ సదృశ్యమైనది. కత్తులబోను వంటి తేళ్ళు మూటగట్టి గోనెవంటిది. పాముతో చెలిమి పులితో సహవాసముచేసిన వానికివలె ముప్పుతప్పదు.

శి : ఎరుకకు ఏమి ఆధారము ? ఏలాగునవచ్చెను ? ఏలాగున పోయెను ?

గు : దానికి ఏ ఆధారమూలేదు. దానికి అదేవచ్చెను. దానికి అదే పోయెను.

శి : ఇందుకు దృష్టాంతమేదైనా గలదా ?

గు : మేఘము వచ్చిపోవుటకు ఏమి ఆధారమున్నది. ఈ మార్గము దృఢంలేకపోతే ఎన్ని యుక్తులువిన్నా ఎన్ని దృష్టాంతములు విన్నా, వ్యర్థము, ఏలాగంటే, పిరికి బంటుకువున్న అస్త్ర శస్త్రములును, సభాకంపముగల వానికి విద్యయు ఏలాగున వ్యర్థమో, అట్లే.

శి : మరియెట్లాగు ?

గు : ధృఢాభ్యాసముచేత భ్రాంతిరూపమైన ఏమలినమును కమ్మదు; ఒకవేళ కమ్మినా, గురువాక్యస్మరణచేత ఆవరణ తొలగి బోధదృఢము కాగలదు.

శి : జ్ఞానకర్మాది మార్గములచేత ముక్తిపొందదా ?

గు : పొందదు ఛిద్ర (పగిలిన) నావతో ఏరుదాటగలడా ?

శి : పోనీ, కర్మ యోగజ్ఞానములు అభ్యసించి, అటుతరువాత పూర్ణబోధ గ్రహించకూడదా?

గు : జ్ఞాన కర్మలతో బద్ధుడైనచో ఒక మట్టుకు అంతులేదు. కులాల చక్రమందున్న చీమ రీతిగా తిరుగుతూ వుండవలసినదే. మబ్బులో ప్రొద్దుకూకితే యెలాగో అలాగే.

శి : ఆదృష్టాంతము యిక్కడ ఎందుకు పనికివచ్చును ?

గు : సూర్యుడు మబ్బులో వున్నాడు. ఇంకా చాలపొద్దువున్నది అని బాటసారి ఆలోచిస్తూ వుండగానే సూర్యాస్తమయమై చిమ్మిన చీకట్లు కమ్మినట్లు ఇంకా ముందు ఎప్పుడో సావుకాశము కలుగుతుంది. అపుడు పరిపూర్ణబోధ తెలుసుకొనవచ్చును అనుకుంటూ వుండగానే ఆయుర్దాయము ఆఖరైపోతుంది అన్నమాట.

శి : ఈ నిరావరణ పరిపూర్ణబోధవడసి నిశ్చలుడై వుండుటకు ఏమి చేయవలయును.

గు : చిగిరిస్తూవుంటే చిదిమి వేస్తుంటే ఏభ్రాంతీ వుండదు. యెంత ఏనుగైనా అంకుశమునకు, ఏలాగున లోకువో ఎంతగుఱ్ఱమేనా కళ్ళెముతో ఎట్లు లొంగునో, అట్లే గురుమంత్ర జ్ఞానముచేత మనోచలనము అణగిపరిపూర్ణ నిశ్చయము కలుగును.

శి : అట్టి సాధన ఎంతకాలము చేయవలెను ?

గు : అంభఃపూరితమైన మృత్కుంభము, శిలయందు పెట్టగా పెట్టగా శిలకూడా కుదురై గుంటపడ్డట్లు అభ్యాసము చేయగా చేయగా దృఢమగును. యెంతదుష్ట పశువైన మాలిమి చేయగా వశమగును.

శి : దుష్టులు ఎంతమంది చేరియైన పరిపూర్ణభావజ్ఞుని చలింపచేయజాలరని తమరు శలవిచ్చినారు. అట్టి మహాత్ముని సాన్నిధ్యము వలన ఆదుష్టులుకూడా బాగుపడుదురేమో!

గు : మహాత్ముల వద్ద అల్పులువున్నా వారి అల్పగుణములు వదలవు శివునికి ఆభరణమైనప్పటికి పాములకువున్న విషము వదలునా ? శివుని శిరస్సున వున్నప్పటికిని, చంద్రునికళంకము పోయినదా ? వేపచెట్టునకు ఎప్పుడైనా చేదుపోవునా ?

శి : అల్పమైన జీవోపాధి విషయం ఎట్లావుండినా సర్వశక్తి వంతుడగు ఈశ్వరోపాధికి ఎరుకవున్నా ఏమిబాధ ?

గు : ఎరుక ఎంతదేహము వహిస్తుందో అంత అవస్థ, ఎంత రాజుకు అంతసేవ, ఎంత వృక్షమునకు అంతగాలి ఎట్లాగో అట్లాగే.

శి : అంత గొప్పబోధను అందరూ గ్రహించగలరా ?

గు : సూక్ష్మబుద్ధిగలవాడైతే సూక్ష్మముగా చెప్పవలెను స్థూలబుద్ధి గలవాడైతే స్థూలముగా చెప్పవలెను. ఎంతవాడైతే అంత గ్రహిస్తాడు.

శి : ఐతే అందరినీ కూర్చోబెట్టి పంక్తిభోజనం పెట్టినట్లు అందర్కీ ఒకేపద్ధతిగా బోధ ఎందుకు చెప్పుచున్నారు.

గు : ఎంతమోహమో, అంతదుఃఖం: ఎంతగుండో అంతతూనిక అంతఃకరణ భేదము లుండితీరును. ఉప్పునీటి సముద్రపుటొడ్డున త్రవ్వితే మంచినీరు పడవచ్చును. ఎవరి శక్తి కొలదీ వారు గ్రహిస్తారు. అర్థంకాకపోతే సత్శిష్యుడు తెలియబడిన వానివలె నటించి వూరికొనడు. అర్థమయ్యే వరకు మరల మరల అడిగి తెలుసుకొంటాడు.

# పరిపూర్ణబోధ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదరూపం

## సర్వవిలక్షణ ప్రకరణం

గు : పరిపూర్ణము దేనికి అవకాశము యివ్వదు.

శి : ఎందుచేత ?

గు : జలము పాషాణాదికములకు అవకాశమిచ్చినట్లు అవకాశము ఇచ్చుటకు పరిపూర్ణమందు అవకాశరూపమైన ఆకాశములేదు.

శి : పరిపూర్ణ మెచ్చటనున్నది ? మిగిలినవన్నియు ఎచ్చట నున్నవి ?

గు : అన్నిటియందు పరిపూర్ణమే వున్నది. పరిపూర్ణమునందే అన్నియు వున్నవి.

శి : అది యెట్లాగు ?

గు : వాస్తవంగా విచారిస్తే అన్యమేమీ లేనేలేదు. వున్న దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే.

శి : మరి తోచుచున్న ఎరుక ఎట్లుపోవును ?

గు : గురువాక్యసూచన ద్వారా ఎరుక వుండదు.

శి : ఎట్లా లేకుండాపోవును .

గు : 'సూర్యదర్శనధ్వాంతవత్' (సూర్యుని చూచిన చీకటివలె పరిపూర్ణము యొక్క జాడ తెలిసినచో ఎరుక అట్లే లేకుండాపోవును. అప్పుడు వర్షముచేత పరాగము (ధూళి) ఎట్లు అణగిపోవునో, అట్లే గురువాక్యము చేత సర్వభ్రమలు అణగిపోవును. నట్టేటిలో పుట్టి మునిగినట్లె పరిపూర్ణం జాడ తెలిసిన ఎరుక మళ్ళామళ్ళదు. లేనిచో మబ్బులో ప్రొద్దుకూకినట్లెవుండి సూర్యుడు మరల మరల కానవచ్చినట్లె ఎరుక మరల మరల పుట్టుచూనే వుండును.

శి : అంతటానిండి పరిపూర్ణము ముందరనే వుండగా (కట్టెదుటే వుండగా) అందరకు ఎందుకు కానరాదు కండ్లకు కానరాక పోతేమానె మనస్సున కెందుకు కానరాదు ?

గు : పుట్టు అంధునివద్ద అద్దమున్నప్పటికి, తన ముఖవిలాసము కానరానట్టే కానరాదు. కుడితికుండలో సూర్యుడు కానరానియట్లు మనోమాలిన్యముంటే తెలియదు.

శి : మనోమాలిన్యముపోతే ఎరుకకు పరిపూర్ణము గోచరించునా ?

గు : గోచరించదు. అగ్నిని ముట్టుకుంటేగాని కాలదు. అలాగే పరిపూర్ణము తెలిస్తేగాని ఎరుకపోదు. లేకుంటే సముద్రములో ఆనపకాయ బుఱ్ఱవేస్తే ఏలాగునా మునక్కుండా తేలకుండా వుండునో అలాగే వుండును.

శి : అహంకారము పోతే ఎరుక పోవునంటారు కొందరు.

గు : అహంకారం వాచ్యార్థలక్ష్యార్థములలో పూర్తిగా పోయినచో ఎరుక పోవును.

శి : మౌనముచేత అహంకారము పోవునా ?

గు : మౌనమైనా అహంకారమే, వాగ్వ్యాపారమైన అహంకారమే. ఎరుక లేకపోతేనే ఏమిూలేదు. అదియే నిరహంకారము.

శి : ఏబోధచేత నిరహంకారుడు అగును ?

గు : నిర్దేహబోధచేతగాని నిరహంకారుడు కాడు శ్రుతి : "జ్ఞాన వస్తువియోగేన, విలయంయాతి మానసం" అనగా తాను అగు ఎరుక లేకుండాపోతేగానీ, మనస్సు విలయము చెందదు. కనుకనే లీలావాక్యము "తాను యేగినమాయ తడయకనేగు" మాట లాడకున్నంత మాత్రమున మౌనముకాదు.

శి : ఎందుచేతకాదు . మాట్లాడక కూరుచుంటే అహంకారం ఎచ్చటనుండును ?

గు : లోపల అహంకారము అభివృద్ధిగా వుంటుంది. స్తంభించిన అగ్నివత్తు, కుంభించిన రోగవత్, ఘనీభవించిన జలముగా అహంకారము పేరుకొనియుండును. సముద్రములో బడబాగ్ని లోపలదాగి కాల్చినట్లే అహంకారము దాగి వుండును.

శి : ఇట్టి అహంకారమును ఏవిధంగా కాల్చివేయవలెను ?

గు : గురుకృపచేగానీ అహంకారము కాల్చబడదు. అపుడే సర్వభ్రమ నివర్తియగును.

శి : గురువాక్యముకూడా ఎరుకయే కాదా ?

గు : అవును, ఎరుకచేతనే ఎరుకను లేకుండా చేయవలెను. రేగికాయ మింగలేని మానవుడు తాటికాయ మింగలడా? గోడకు నిచ్చెన వేసి ఎక్కినట్లు ఆకాశానికి నిచ్చెనవేసి ఎక్కవచ్చునా? కనుక ఎంతటి ధీరుడైనా గురువాక్యమును మరువరాదు. వ్యష్టి నతిక్రమించుటయే కష్టమైతే సమష్టియగు గురతత్వము అంత తేలికగా రహితం కాగలదా !

శి : ఈబోధ అందరికీ చెప్పవచ్చునా ?

గు : ఇద్దరికి చెప్పవచ్చు ఒక్కరికి చెప్పరాదు. చూతఫలము పండితే పులుపు విరిగిపోవును. వేపకాయ పండితే విషం విరిగిపోవును. కానీ విషముష్టిపండు పండితే విషము అధిమగునేకాని విడువబోదు. అలాగే శిష్యవిచక్షణ చేయవలసియుండును.

శి : బంధమోక్ష విముక్తి ఎట్లగును ?

గు : బ్రహ్మతో నేగానిగాదు. ఎరుకైన బ్రహ్మమును నమ్మికొని సంసారము తరించబూనటము చిద్రనావలో సముద్రము దాటుట వంటిదే. ఎరుకను నమ్మితే బంధనాగారము నందున్న మానవుని శృంఖలాబద్ధము కూడా చేసినట్లే.

శి : యోగానందమందు నిమగ్నుడై ఏమీ తెలియక వూరకుంటే చాలదా ! ఎరుక లేకపోయినట్లే కదా !

గు : అమావాశ్యనాటి రాత్రి తనముఖము అద్దములో తనకు కానరాకుంటే ముఖమే లేనట్లా? తన తల్లిదండ్రులను తానుగుర్తెరుగకుంటే తనకు అసలు తల్లిదండ్రులే లేనట్లా ? అలాగే ఎరుక విస్మృతిచెందిన (మరుపుసుషుప్తి, మూర్ఛ. సమాధి మొదలగు వానియందు ఎరుక లేకపోవుట) మాత్రమున ఎరుక లేనట్లు కాగలదా ?

శి : గురువాక్యమును తెలిసి వూరకుంటే చాలదా ? మాటి మాటికి గురువాక్యము ఎందుకు స్మరించవలెను ?

గు : గురువాక్యము స్మరిస్తూవుంటే దుర్భ్రమ అంటదు. గురువాక్యము చేతనే తాను లేనని చివరకి దృఢమగును.

శి : ఎట్లా దృఢమగును స్వామీ ?

గు : సారధిరధంతోలుచూ సుషుప్తిచెందితే పూర్వాభ్యాసం చేత అసలు మార్గము తప్పకనే పోయినట్లు తాను ఏదైనా ఆలోచనలు చేస్తూవుంటే దేహము పూర్వ అభ్యాసముచేత మార్గమందే నడుస్తున్నట్లే గురువాక్యం దృఢమైన పిమ్మట యిక బాధలేదు.

శి : ఎందుచేత బాధలేదు ?

గు : మట్టికుండయైనా పాషాణమందు పెట్టగా పెట్టగా అరవడి ఏర్పడి అది తిరగిపోదుగదా ! అవివేకికి సర్వకాల సర్వావస్థలయందు దేహమే నేనని ఎట్లు దృఢమో, వివేకికి తానే బ్రహ్మనని ఎట్లు దృఢమో అట్లు ఈ నిర్దేహబోధచేత తానేలేనని దృఢముకావలె.

శి : దృఢమగుట అనగానేమి ?

గు : తలచినా తలవకున్నా తాను లేననే భావము తనకు సహజమై పోవుటయే దృఢమనబడును.

శి : చిజ్జడముల రెంటికి భేదమేమి ?

గు : చిజ్జడములు రెండూ ఒకే వస్తువుయొక్క రెండు రూపములు మాత్రమే.

శి : అలాగే జీవ ఈశ్వర బ్రహ్మరూపములు మూడు ఒకే వస్తువు మారురూపములేనా ?

గు : పరమార్థతః ఒక్కటేయైనా కించజ్ఞత్వాది గుణములు గలవాడు జీవుడు. సర్వజ్ఞత్వాది గుణములుగలవాడు ఈశ్వరుడు అన్ని గుణములను తనయందు బీజరూపంలో దాచుకొన్నది నిర్గుణ బ్రహ్మము అని చెప్పబడుచున్నది.

శి : మరి వీనికి ఏకత్వము ఎట్లు చెప్పవలెను.

గు : పర్వతమువంటివాడు ఈశ్వరుడు. బలపరాయివంటివాడు జీవుడు ఈ రెండూ ఒక్కటే. నీళ్ళల్లోవేస్తే అదీ మునుగును, యిది మనుగును. అలాగే యిదీపోయేదే అదీపోయేదే. చిత్తును విడిచి జడము ఎక్కడా లేదు.

శి : మరి జీవేశ్వరబ్రహ్మల మాటయేమి ?

గు : జీవబ్రహ్మలకు పరిపూర్ణమున గుర్తు లేదు. ఈశ్వరుడు ఎక్కడో వున్నాడని మూఢులకు నమ్మకము. అంతా మృషయే.

శి : సిద్ధాంతమేమో శలవివ్వండి ?

గు : పోయ్యేది ఒకటి, పోనిదిరానిదీ ఒకటి వున్నది అంతాటా వున్నది లేనిది ఎక్కడా లేదు.

శి : శరీరము, అశరీరము ఏమి ?

గు : అపదార్థమునకు అంతము లేదు. పదార్థానికి పాదులేదు. అపదార్థము విచారణచేసి పదార్థము పోయెనని విచారణలో తెలియుటే విచారమునకు ఫలము. లేనివిచారము లేకచేసి లేనిది లేకపోవుటయే ఫలము. వుండి విచారించ కూడదు.

శి : యిట్టి ఫలమును (స్థితిని) ఏమందురు ?

గు : యిదియే తనువు లేని తాత్పర్యము. ఇదే స్వస్వరూప రహిత అనిర్వాచ్యావస్థితి యిది ఆరవది.

శి : మొదటి అయిదు ఏమి ? జాగ్రత, స్వప్న, సుషుప్తి, తురీయ, కైవల్యములా ! ఆరవది ఎట్లు తేటపడగలదు ?

గు : అవును తెలివి విడిస్తేగాని తేటపడదు. లేక వచ్చినాసరే, పోయి రాకున్నాసరే.

శి : యిది తెలియడానికి ఏయే శాస్త్రములు అవసరము ?

గు : ఏ శాస్త్రములూ అక్కరలేదు. వాని ద్వారా ఎన్ని వేలసంవత్సరములకైనా తెలియదు. చెవులు కుట్టటానికి గెడ్డపారయున్నూ కాలిలో విరగిన కంటకం తీయడానికి పారయున్నూ ఎలాగున అక్కరకురావో అలాగే, ఎరుక సంబంధమైన శాస్త్రయుక్తులు ఎందుకూ పనికి రావు.

శి : విశేషపాండిత్యముంటేగానీ శాస్త్ర గ్రంథములు సహాయకారి కాజాలవు.

గు : ఈబోధగలవాడు ఎరుకగ్రంధములకేమీ వెరువడు ఏలాగంటే పాదరక్షలుగలవాడు కంటకములకు అగ్నికి పామునకు యేలాగున లెక్కపెట్టడో, అలాగే ఎరుక విడిచినవానికి నిర్భయము. మబ్బు వదలిపోవును, కూనము విడిచిన సర్పము మేలుకున్నట్లు వుండును.

శి : అంటే వారి పత్రాపము అంత గొప్పగా వుండునని తన అభిప్రాయమా ?

గు : కాకులు ఎంత బలిసినా నరుల దగ్గరకు రావు. నక్క నిర్జీవ కళేబరముయొక్క డొక్కచించునుగాని, బ్రతికి ఉన్న జంతువుపైకి రాదు. తెల్లకట్టెను పురుగు దొలుస్తుందిగాని చేవవున్న చోటికి చేరలేదు. అలాగే పరిపూర్ణబోధ యందు దృఢము గల వారిని చెరువలేరు. అనేక దినములు గురుశుశ్రూష చేయకుంటే భ్రమవదలదు. పరిపూర్ణ బోధ సిద్ధంచదు.

శి : ఎరుక మార్గము కలవానికి మహత్తులు కలుగును కనుక ఎంతో మందిని ఆతడు ఆకర్షింపగలడుగదా ! అనేకులాయనను అనుసరింతురు.

గు : కోతి వెంబడి ఎందరురారు ? ఇంద్రజాలకుని చిత్రాలను ఎందరు మెచ్చరు ? వేశ్యయొక్క నృత్యగీతాలకు ఎందరు బహుమతులు యివ్వరు ? వేదపాఠకులుగాని వేదాంతులు గాని యెప్పటికైనా అంతటి బహుమతులు పొందగలుగుదురా ?

శి : పండితులైనవారు చక్కగా ప్రసంగంచేస్తూ శాస్త్రార్థం చేస్తారు.

గు : గంగిరెద్దు మెడలో యెన్ని గంటలు మ్రోగితే ఏమి ఫలము ?

శి : వారు సమస్తమైన వస్తువులు చేతవుంటారు. పల్లకీ అందలములపై ప్రయాణాలు చేస్తారు.

గు : ఏమి ప్రయోజనము ఈ బాహ్యాడంబరము, సత్కార మానపూజార్థమున్నూ, ధనకనకాది వస్తుసంగ్రహమునకున్ను కీర్తి ప్రతిష్ఠలకున్ను మాత్రమే, యిది యెన్నడు రాజయోగానందముతో సరికాదు. లేని సుఖముచేత ఆనందించేదే ఉత్తమము. క్షణికమైన విషయసుఖము సుఖముకాదు.

శి : ఎరుక అన్య సహాయమేమియూ లేకుండా స్వప్రకాశమై సాలిపురుగువలె సర్వకారణమైయున్నది.

గు : సాలిపురుగు దృష్టాంతము ఎట్లు సరిపోవును ? ఏదో ఆధారముచే అది గూడు అల్లగలదే కాని నిరావరణమందు అల్లజాలదుగదా !

శి : మహాత్ములకు అన్య సహాయము అక్కరలేదు. ఒక్కటే చక్రముగల రధము నిరాలంబమైన ఆకాశమార్గమున తొడలు, కాళ్ళు లేని సారధి. యిట్టి రథముపై ప్రతిదినమూ వుదయాద్రి నుండి అస్తాద్రివరకు ప్రయాణము సాగించు సూర్యభగ

వానునికి యే సహాయము కలదు. అట్లే చెరకు కర్రయే ధనస్సు బాణములు చూద్దామంటే పూవులు వింటికి కట్టిన నారి చూద్దామా తుమ్మెదల వరుస. స్త్రీల యొక్క చంచలమైన పూవులు వాడి తూపులు. స్నేహితులు చూద్దామా ? చలిగడ్డ కట్టిన చంద్రుడు. తనకా శరీరమే లేదు. అయిననూ, సకల భువనములను మన్మధుడు కలవరపెడుచున్నాడు. కనుక మహాత్ములకు ఏసాధన సామగ్రితోనూ అవసరము లేదు.

గు : నిరావరణ పరిపూర్ణమందు లేక తోచిన ఎరుకకు ఎంత సామధ్యమున్నను దేహము లేకుంటే ఏ కార్యముచేయజాలదు. సర్వదేహేంద్రియాలూ ఆత్మయే. ఆత్మకంటే అణుమాత్రము అయిననూ వ్యతిరిక్తము లేదు. కార్యకారణ రూపముగాయున్న సర్వమూ ఎరుకే.

శి : ఉపాధి రహితమైన యెరుక, స్ఫటిక సన్నిభమై మహా పవిత్రమైనదానిగా వర్ణింపబడుచున్నదే!

గు : ఎరుకను విడిస్తే దేహమే కార్యమునూ చేయజాలదు. దేహమును విడిస్తే ఎరుకయున్నూ ఏ కార్యమూ చేయజాలదు. కనుక రెండున్నూ ఒక్కటే, యెరుకవున్నంత సేపు ఎంత ఘోషించినా అది పవిత్రముకాదు. సురాభాండము, శవదేహము, కాశీగంగ చేత కడిగినా పవిత్రంగానట్లు ఎరుక ఉన్నంతసేపూ పవిత్రము కాదు.

శి : మహత్తులన్నీ ఈ యెరుకవే కదా ?

గు : అవును, సూదిని చలింపచేసే సామర్ధ్యము అయాస్కంతమునకున్ను, సూర్యరశ్మి సోకగానే అగ్నిపడే సామర్ధ్యం సూర్యకాంతిమందునూ వున్నట్లు సర్వ సామర్ధ్యములు ఎరుకయందే బహునిగూఢంగా వున్నవి.

శి : పులికి సర్వవిద్యలు నేర్పి పిల్లి చెట్టు ఎక్కుట నేర్పకుండా వున్నట్లుగా అన్ని రహస్యములు చెప్పి కొన్ని రహస్యములు మాత్రము గురుడు చెప్పకుండా దాచుకునే మాట సత్యమేనా?

గు : సద్గురువు ఎన్నడూ అట్లుచేయడు. ముఖ్య సూత్రములు అన్నియూ గురువు శిష్యునికి తప్పక నేర్పించును. కానీ శిష్యుడు సూక్ష్మబుద్ధిగలవాడు కావలెను, లేనిచో బోధ గ్రహించలేడు. కాశీపోవుటకు మార్గం చూపమంటే కడకల్లా చూపుతారా ? తల్లిదండ్రులు ఎల్లప్పుడూ పోషించెదరా ? తాడియెక్కే వానిని ఎంతవరకు పైకి గెంటగలరు ? ఒక సూచనచేస్తే సత్శిష్యుడైనవాడు సమస్త కార్యములు దిద్దుకోవలెనుగానీ ఎందాకా గురువు సవరిస్తాడు నూతులో నీళ్ళు వూరవలెనేగాని కురిసిన వర్షపు నీరు ఎంతవరకుంటుంది?

శి : ఈబోధను ఎట్టివాడైతే సులభంగా గ్రహించగలడు.

గు : అసంభావన, విపరీతభావనా లేనివాడై, గురుభక్తి కలవాడై యుంటే, సులభంగా గ్రహించగలడు. మనస్సునందలి అజ్ఞానము తెగి సమస్త జాగ్రత్తలు కలిగి సూక్ష్మంగా గ్రహించి సుస్థిరుడై యుండును.

శి : అట్టి గురుభక్తి ఏ విధంగా వుండవలెను ?

గు : అది స్వాభావికముగానే రావలయును. ఆగంతుకముగా తెచ్చిపెట్టుకొంటే అది నిలువదు.

శి : ఎందుచేత ?

గు : అస్త్ర, శస్త్రములు ఎన్ని వున్నా ఒకరిని చూచి నేర్చుకొనవలెనంటే శూరత్వము ఎక్కడి నుండి వచ్చును. అట్లే విద్యయెంత నేర్చిన, ప్రాప్తిలేనిదే ధనము సంపాదించగలుగునా?

శి : మీవాదనమునకు ఇతర మత వాదములకునూ తేడా ఏమి ?

గు : అన్ని మతములవారు దేహబ్రహ్మవాదులే. గానీ పరిపూర్ణ భావజ్ఞులవలె నిర్దేహ బ్రహ్మవాదులు కారు.

శి : ఈ రెండు వాదములకు తేడా ఏమి ?

గు : దేహ బ్రహ్మవాదులనగా బ్రహ్మమునకు కూడా ఒక దేహము (లేక శరీరము, లేక ఆవరణము) వున్నదనే వారు. నిర్దేహబ్రహ్మవాదులు అనగా బ్రహ్మమునకు ఎట్టి ఆవరణము లేదనీ అది అశరీమూ కేవల నిరావరణమూ అనీ వాదించెడివారు. ఆ బ్రహ్మమునందు స్వకియ, పరకీయ, చిద్దేహములు ఏమీ లేవు, అనేవారు పరిపూర్ణులు.

శి : ద్వైతాద్వైత విశిష్టద్వైతులు కూడా చార్వాకులవలె దేహబ్రహ్మవాదులేనా !

గు : అద్వైతులు చిద్దేహ బ్రహ్మవాదులు ఏలననగా ఆ బ్రహ్మము చిత్ స్వరూపమని వాదింతురు. ద్వైత విశిష్టులు జడదేహ బ్రహ్మవాదులు, చార్వాకులూ దేహబ్రహ్మ వాదులే. కుడిఎడమ వాసి హెచ్చుతగ్గూ మాత్రమే. చిజ్జడ రహితమైన వారు నిరావరణ పరిపూర్ణులు, ఈ నిర్దేహబోధ వంటి మార్గములేదు. ఇదే అస్తి, నాస్తి రహితము.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదము

## పరిపూర్ణ బోధస్థితి ప్రకరణము

గు : పరిపూర్ణమునందు ఎరుక పరాక్రమము ఎంతమాత్రము పనికిరాదు.

శి : ఈ పరిపూర్ణ స్థితి ఎట్లు నిలకడచెందును ?

గు : గురుశుశ్రూష చేయక గ్రహించబోతే ఈస్థితి తెలియదు. ఎంత బలవంతుడైనా శూరత్వము లేకుంటే ఏలాగున వ్యర్థమో ఎంతమేఘమైనను వర్షము లేకుండా ఏలావ్యర్థమో అట్లే ఎన్ని యుక్తులైనా వ్యర్థం.

శి : ఇన్ని యుక్తులు ఎందుకు ?

గు : దృఢంకోసం పదిమంది దుఃఖిస్తూవుంటే ఎంత కఠినునికైనా దుఃఖము పుట్టునట్లు పదిమంది తీర్థయాత్రా ఫలంనపేక్షించి వెడుతూవుంటే ఎంత మూర్ఖునికైనా పోదామని బుద్ధిపుట్టినట్లు యెన్నో యుక్తులు చెపితేగాని బోధదృఢముకాదు.

శి : గురువాక్యము దృఢమైతే వానికి ఇక ఎరుకజగత్తులు లేనేలేవా ?

గు : పగటియందు సూర్యప్రభచేత, నక్షత్రములు ఏలాగున కానరావో, నుసికప్పిన తరువాత నిప్పువున్నా ఏలాగున కానరాదో అలాగే గురువాక్యము దృఢమయిన తరువాత యెరుకజగత్తులున్నా ఏవిధముగానూ భ్రాంతి కారకములు కావు.

శి : ఎంత దృఢమైనా జగుత్తువున్నట్లే తోచుచున్నదికదా !

గు : మృత్తు లేనపుడు ఘటము లేదని చెప్పవలసిన పని లేనట్లే జగత్తు ఏమీ లేదనిచెప్ప నిమిత్తములేదు.

శి : మతములవారందరూ యీ నిరాకారబోధ ఎరుగరా ?

గు : వారందరూ సాకారబోధవారే !

శి : అది ఎట్లు ?

గు : రజ్జువునందు సర్పము తోచినట్లుగానే బ్రహ్మమునందు విశ్వము తోచినదని చెప్పిరి. సాకారమందే సాకారము తోచునుగాక నిరాకారమందు తోచలేదుకదా ! రజ్జువు సర్పమూ రెండూ సాకారములే.

శి : అందువలన ఏమి సిద్ధించును ?

గు : కార్యము సాకారమైతే కారణము నిరాకారమగునా ? మృత్తిక యందే ఘటము పుట్టనుగానీ, వాయువునందు ఘటము పుట్టునా ? అలాగే వారు నిర్గుణమని చెప్పినా అది సగుణమే. కనుక వారు ప్రతిపాదించే బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మము కాదు.

శి : అద్వైతాది మతస్తులు బ్రహ్మజగత్తులగూర్చి ఏమి చెప్పిరి ?

గు : మృత్తుసత్యము, ఘటము అసత్యము అని తార్కికాదులు చెప్పినట్లే, ఆత్మసత్యమనిన్నీ అనాత్మ అసత్యమనిన్నీ అద్వైతులు అందురు.

శి : విశిష్టాద్వైతు లేమందురు ?

గు : వ్యవహారికులు మృద్ఘటములు రెండు సత్యమందురు అలాగుననే చిత్తులో చిత్తు విశిష్టమనిన్నీ, అవిశిష్టమైన చిత్తే ఈశ్వరుడనియు ఈశ్వరునిశక్తే మాయయనిన్నీ చిత్తు జీవుడనిన్నీ విశిష్టాద్వైత మతము.

శి : ద్వైతమతస్తులు ఏమందురు ?

గు : అంగరూపమైన జీవుడు వేరనిన్నీ ఈశ్వరుడు వేరనిన్నీ ద్వైతమతము, అణువాద, మధ్యమవాద, మహద్వాద, సద్వాద, అసద్వాద, సాక్షీవాద, చిద్వాద, అచిద్వాద,

చిదచిద్వాద, ప్రియవాద, అప్రియవాద, ప్రియాప్రియవాద, శూన్యవాద, మాయా మహిమవాద, మంత్రవాద, యంత్రవాద, తంత్రవాద, బౌద్ధవాద, మొదలైన వాదము లన్నియు యెరుకలో అంతర్భూతములే కాని యెరుకను మించిన మార్గములు కావు. అవి అన్నియు అహంకారాస్పదములే కాని నిరహంకార నిరాశ్రయానుభవము లేదు. ఈ బోధతో సమానము కావు.

శి : అవిమాత్రము బోధలు కావా ? వాని తక్కువ ఏమి ?

గు : బ్రాహ్మణునికి, అంత్యజునికి, నామమొక్కటే యున్న మాత్రమేచేత, వారు యిద్దరూ ఒక్కటే ఏలాగున కారో అలాగే బోధ అనుపేరు వున్నంతమాత్రమున అవి ఈబోధతో సరికావు. బోధ అనగా మెలకువ, భ్రాంతిరహితము, పరిపూర్ణ బోధ ఒక్కటే భ్రాంతి రహితము చేయకలదు. కనుక బోధ అనెడిపేరు దానికొక్క దానికే సార్థకమగును.

శి : ఆ మతప్రవర్తకులకు యీ బోధ తెలియదా ఏమి ?

గు : ఎరిగివుండిన్ని ఈ యెరుక యొక్క ప్రతిపాదనమే చెప్పినారంటే అది తప్పుకాదు. శిష్యుని అధికారంకొద్ది చెప్పినారేకాని అది వారియొక్క అభిప్రాయముకాదు.

శి : రెండు రకముల బోధలూ వారే చెప్పినప్పుడు రెంటికి సమాన ప్రతిపత్తి, లేక ప్రామాణ్యము, ఏల వుండరాదు?

గు : శివుని శిరస్సున చంద్రుడు వుండును దుత్తూర కుసుమమూ (ఉమ్మెత్తపువ్వు) వుండును. ఉన్నంతమాత్రము చేత రెండూ సమానమగునా ?

శి : పరిపూర్ణ భావజ్ఞులను తేలికగా గుర్తించనగునా ?

గు : గుర్తించుట కష్టమే. పరిపూర్ణుని యొక్క స్థితి ఎంత వానికి తెలియబడదు, నుసిగప్పిన నిప్పువలె, ఒరయందున్న శస్త్రమువలె, వెన్నమెత్తిన శిలవలె తెలియ బడదు. ఈ బోధకలవానికే అట్టిస్థితిగానీ, యిట్టి గ్రంథముకాని అహ్లాదకరముగా వుండును.

శి : అది ఎవరి దోషము ?

గు : అది బోధస్థితి దోషముకాదు. గ్రంథదోషమూ కాదు. రత్నపరీక్ష తెలిసినవాడే రాళ్ళయందున్న రత్నమును గుర్తించగలడు. నేత్రమున్నవాడే సూర్యుని చూడగలడు. అలాగే చూసేవార్ల వికారమేకానీ, స్థితియందు ఎట్టి వికారమూలేదు.

శి : ఎంత చదివినా, ఎంత తెలిసినా, మాయయెందును పోవుట లేదు ?

గు : దేహము కృశించినా, ఆశ కృశించినట్లుగానే, "నేను ఏమీకాను. దేహేంద్రియ మనఃప్రాణములు కాను అన్న మాత్రమున మాయపోదు.

శి : మరి యెట్లు పోవును ?

గు : సుషుప్తియందుగాని సర్వేంద్రియ వ్యాపార రహితము కానట్లున్ను ఉదయమైతేగాని అంధకారము పోనట్లును యెరుకపోతేనేగాని ఏ భ్రాంతీపోదు. ఎంత ఎండలోనున్నా తల్లివేరు తెగనిదే వృక్షము నశించనట్లు ఎరుకను తీసేస్తేనే గానీ భ్రాంతులు పోవు.

శి : యెరుకను ఎట్లా తీసివేయవలయును ? ఎట్లు ఈబోధలభించును.

గు : కర్మ, ధర్మ విజ్ఞానములు యెన్నివున్నా ఈ బోధ లభించదు. ఎరుకార్ణవ బడబానలమైన గురుమంత్రము చేతనే ఇది సాధ్యం, యిది మరువకుంటే ఏ మమతలు క్రమ్మవు. యెరుకయనే తెర ఇతరములగు ఎన్ని శస్త్రముల చేతనైనా చేదింవబడదు. హరిహరబ్రహ్మాదులకైనా గురుకృప లేకుంటే సాధ్యము కాదు. యుక్తులచేతగాని మనస్సునకు దృఢము కాదు. బోధ నిలువదు.

శి : ఈ బోధస్థితి దృఢత్వము ఎంతకాలము నిలుచును ?

గు : లాంతరులో దీపము ఎంతగాలికొట్టినా పోనట్లు, ఎన్ని కంటకములకైనా పర్వతము బాధపడనట్లు యే భ్రాంతులకును పరిపూర్ణుడు జడియడు. దృఢత్వము పోదు.

శి : ఎన్ని తెలసినా మరల మరల భ్రాంతులు కలుగుచునే వుండును కదా ?

గు : దీపమైతేనే గాలికి పోవును. కాని రత్నదీపముకాని, సూర్యప్రకాశముకాని, వాయువుచేత అణగిపోనట్లుగానే యీబోధ తెలిసినవానికే భ్రాంతి పుట్టదు.

శి : పరిపూర్ణమును ఎట్లు సాధించవలెను ?

గు : సాధించుదామంటే సాధ్యముకాదు. భేదించుదామంటే భేద్యం కాదు. చూడబోతే చూద్దామనేదేలేదు. కొండ నాలుకకు మందుపెడితే వున్ననాలుకే వూడిపోయినట్లుగా దానిని చూడబోతే యిదే లేకపోయెను. బెల్లంతో బొమ్మనుచేసి సముద్రమందు వేస్తే అది సముద్రపు లోతు ఎరుగజాలనట్లే యీ ఎరుక పరిపూర్ణము యొక్క అంతం ఎరుగదు. ఆపైన ఏమీ అనరాదు.

శి : అయితే ఈ బోధయందు దృఢత్వము చెందినాడనుటకు నిదర్శనమేమి ?

గు : ఎరుక అనే ఆవరణము తొలిగిపోవుట. దేనియందు కోరిక లేకుండుట ఫలములు; నిదర్శనములు

శి : యితర మార్గములచే ఈ ఫలమెందుకు రాదు ?

గు : "మర్కటస్య సురాపానం మధ్యే వృశ్చికదర్శనం" అన్నట్లు అసలే చలనాత్మకమైన ఎరుక సంసారములో మరీ మరీ మునిగిపోయి నిశ్చయముగ చెడిపోవును. మెడలో గొలుసుకట్టి కుక్కను లాగుకొనిపోవునట్లు కర్మములకు చిక్కితే మృత్యువుకు చిక్కుపడతాడు.

శి : అయితే కర్తవ్యమేమో శలవీయండి స్వామీ !

గు : యిప్పుడు మేలుకుంటే యెప్పటికీ చావులేదు కనుక మేలుకొని, చస్తాను అనే భయము విడిచి సాధువుల మార్గము అభ్యసించవలెను.

శి : ఒక్క పరిపూర్ణబోధ పద్ధతియే సాధువుల మార్గమనీ మిగిలిన మార్గము లెందుకూ పనికిరావనీ తమ అభిప్రాయమా ?

గు : అలాకాదు, సర్వపదార్థములను అంధకారము కప్పి వానిని కానరాకుండా చేయును. కాని ఆ అంధకార సామర్థ్యము దీపముముందు పనికిరాదు. ఆ దీపము యొక్క ప్రకాశము, దివిటీముందు పనికిరాదు.అదివిటీ యొక్క ప్రకాశము దావాగ్ని ముందు పనికిరాదు. ఆ దావాగ్ని యొక్క ప్రకాశము సూర్యుని ముందర పనికి రాదు. సూర్యుని యొక్క తేజస్సు మేఘముముందర పనికి రాదు. ఆ మేఘముయొక్క సామర్థ్యము వాయువు ముందు పనికిరాదు. అట్లే అంతర మహాదంతరముగా ఈ బోధ ముందర ఏబోధా పనికిరాదు.

శి : మిగిలిన బోధలు యెరుకరహితముచేయుటకు సమర్థములుకావా ?

గు : కావు ? ఎందుచేతననగా ఈ యెరుక గట్టిగా చుట్టిన తాటియాకుల కొత్తచాపవంటిది. ఎట్లు అంటే కొత్తచాప విప్పి క్రిందపరచగానే ఏ ప్రకారము ముడుచుకొని పోవునో ఆరీతిగానే విశ్రాంతిగా వున్నట్లే కనబడి అప్పటి కప్పుడే కమ్ముకొనిపోవును.

శి : ఈ పరిపూర్ణ బోధ శిష్యులకు శీఘ్రకాలములో చెప్పి ముగించకూడదా ? అజన్మాంతము బోధయెందుకు వింటూ వుండవలె ?

గు : కొంచెము కొంచెముగానే బోధ చెబుతూ రావలెను. సూక్ష్మాతి సూక్ష్మముగా మొదటిలోనే విచారణచేసి చెబితే అది అర్థము కాక సంసారములో మునుగుతాడు మరిన్నీ బోధ ఇంతేకదా ! సంపూర్తి అయిపోయినది గదా ! అని అలక్ష్యముతోచి చెడిపోవును.

శి : దేహమును విడచిన యెరుక ఏమగును ?

గు : దేహమును విడచిన ఎరుక తిరిగి దేహములో ప్రవేశించదు. పరిపూర్ణములో దూరదు. మేఘమును వదలి బిందువులు మధ్యలో నిలువనట్లు. గురువాక్యముచేత దేహమును వదలిన ఎరుక మరల ఉపాధికి రాదు.

శి : ఎరుక ఆవిధంగా పోతే ఎరుకవలన కలిగిన కార్యరూపమగు ఈ జగజ్జీవేశ్వరులు యేమైపోదురు ?

గు : సూర్యునితోపాటే కిరణములుకూడా అస్తమించినట్లు యెరుకతోనే సమస్తమున్నూ పోవును.

శి : ఈ బోధ ఎవరికి చెప్పవెలెను ?

గు : జలమందు విడిచిన తైలబిందువు ఏవాగున అల్లుకొనునో బుద్ధియందు నిశ్చయము చేసేవానికి చెప్పవలెను.

శి : లేకుంటే ఏమి జరుగును ?

గు : పాషాణములు, ఇసుక మొదలగునవి జలమునందు మునిగిపోయినట్లే అగును. ఇసుక వుడకబెడితే మెత్తబడి అన్నమగునా ? అనుమాన విపర్యయములు వున్నవానికి ఈబోధ చెప్పనేకూడదు.

శి : యెరుకనే స్వాధీనముచేసుకుంటే దానిని రహితము చేయవలసిన పనేవుండదుగదా !

గు : యెరుక కూటము యెన్నడూ పనికిరాదు. యెరుక కూటము ఎలాంటి దంటే నీడను ఆసించిన కప్ప పాము పడగ క్రిందకు చేరినట్లు, ఆకలితోనున్న మేకపిల్ల పులి పాలకు ఆశపడి దానివెంటపడ్డట్టే ? ఎరుకమార్గముచే కృషి చేయువాడు. "మృత్యోశ్చ మృత్యుమాప్నోతి" అన్నరాతిగా మరణము నుంచి మరణమును అనగా చచ్చుట పుట్టుట, తిరిగి చచ్చుట, ఈ విధంముగా చావు పుట్టుకలకు మధ్య వూగులాడు చుండును.

శి : పరిపూర్ణములో యెరుక ఐక్యమగునా ?

గు : కాదు. వస్తుతః పరిపూర్ణము యెరుకకాదు. యెరుక పరిపూర్ణము కాదు.

శి : ఇనుముకు లేక అగ్నిహోత్రమునకు చెదలు పట్టుట ఎంతనిజమో యెరుక పరిపూర్ణమును బాధించుట అంత నిజము.

గు : సముద్రములోవున్న వరుపుబండకు ఎట్టి వికారములు ఏలాగున లేవో అలాగే పరిపూర్ణమునకు ఏవికారములు లేవు. అన్ని వికారములు చిత్తువే జడమైన దేహమును విడిస్తే చిత్తు ఏమీ చేయలేదు.

శి : కనుక ఆ వికారములు దేహానివే అని ఏల అనరాదు ?

గు : కట్టెయందు ప్రవేశించిన అగ్నిసమస్త పాకాది కృత్యములచేసినా ఆసామర్థ్యము అగ్నిదేకాని కట్టెదికాదు. అలాగే ఆ సామర్థ్యం మంతయు చిత్తుదే కాని దేహానిది కాదు. మహాత్ములవద్ద యీబోధ సాంప్రదాయక పద్ధతిగా సలక్షణముగా తెలుసుకొనవలెనే గాని చాటుమాటుగా స్త్రీ వ్యభిచారము చేసినట్లుగా దొంగతనంగా తెలుసుకొంటే ఎన్నడూ తెలియబడదు.

శి : సర్వభ్రాంతులు పోగొట్టుటకు ముఖ్యముగా కావలసినదేది ?

గు : గురుకృపచేత సర్వభ్రాంతులు పోవును. "గురోఃకృపాగ్ని ధర్ధశ్య పూర్ణభావంస సంస్మరేత్" ఇదే వాస్తవం నిజమైన మార్గం.

శి : బయలు దృగ్గోచరము అగునా ?

గు : కాదు. దృక్ బయలున నిలువదు.

శి : యితరులు దృక్కే బ్రహ్మమందురే !

గు : దృక్కే బ్రహ్మమయితే బయలున నిల్వవలెనుగదా !

శి : ఈ మార్గము చాలా కష్టముగనున్నట్లున్నదే. దీనివలన ఎవరైనను తరింపగలరా ?

గు : సంసారమనే వలలో చిక్కుకునే జీవులనే పక్షులలో ఏదోయొక పక్షే తప్పించుకొనగలదు. అందుకే గీతలో భగవానుడు "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయేయత తామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్వతః! అని శెలవిచ్చియున్నాడు. నిండా మునిగినవానికి చలి లేనట్లే ఈ పరిపూర్ణబోధయందు పూర్తిగా నిమగ్నులై వున్నవారికి ఏబాధాలేదు. అనిర్వచనీయమై మిథ్యాస్వరూపముగానున్న ఎరుక పరిపూర్ణబోధ యందున్న వానికి తుచ్ఛమై కాన్పించి సర్వభ్రాంతిరహితము కాగలదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురు-శిష్య సంవాదరూపము

## సర్వభ్రాంతి ధ్వంస ప్రకరణం

గు : తానుపోయే విచారణ చేసుకోవలెను జగజ్జీవేశ్వరుల విచారం చెయ్యకూడదు.

శి : గురుకృపచేత సర్వభ్రాంతులు నశించెగదా ! పోయినవి తిరిగి వచ్చునా ? మృతమైన పురుషుడు మూడు సంవత్సరములకు మళ్ళీ వచ్చునా ?

గు : పోయినది రాదు. అక్కడక్కడే దృఢమైతేనేగాని పోదు. రజ్జువుయందు పుట్టిన భ్రమ అప్పుడే పోతే, ఆ కంపము కొంతసేపటికి పోయినట్లు; కాచుకొన్నకొద్దీ చలిపోయినట్టు; సూర్యుడు ప్రకాశించినకొద్దీ తమస్సు పోయినట్లు, ఏమీ మిగలకుండా సంపూర్ణముగా పోవుటకై విచారణ అవసరం.

శి : అట్లైతే - తమస్సు నిజంగా పోయినదా ? పోతే తిరిగి యెట్లా వచ్చును ?

గు : ఏదీ వాస్తవం కాదు. వున్నట్టు, పోయినట్టు, మళ్ళీవచ్చినట్టు చూచేవారి వికారముకొద్దీ తోచును.

శి : ఎట్లో శెలవియ్యండి స్వామీ !

గు : ఎండమావులని తెలిసినవాడు జలదృష్టి యేమీ లేకుండా నడచి పోతూవుంటే, వూరిముందర వున్నవాడు పోతూ వున్న మనిషి ఆ జలమందు మునిగి చస్తాడేమోనని భయభ్రాంతులు చెందుతూ వున్నట్లుగానే చూచేవారికే గాని భ్రాంతిరహితుని కేమీలేదు.

శి : భ్రాంతి రహితులను జూచి వీరుకూడా భ్రాంతి వీడకూడదా.

గు : చూచి నేర్చుకునేటందుకురాదు. గురుపుత్రులై గురునిష్ఠ కుదిరితేనే తప్ప అది మహాకష్టము. దొంగ గురుబోధలకు ఆస్తితి ఏలాగున కుదురును ? పశువులకు మనుష్య వాక్యములచేత మాట్లాడు చందము ఎట్లారాదో అట్లే.

శి : ఎరుక భ్రాంతి పోయినా సర్వజీవేశ్వర జగత్తు అట్లనే యందును గదా !

గు : ఉంటేనేమి ? మగ పెళ్ళివారంతా ఏరు దాటుతూండగా పెండ్లి కొడుకు ఏటిలో కొట్టుకొనిపోతే అందరూవున్నా వారు పెండ్లి వారగుదురా ? అట్లాగే ఎరుక పోతే ఏమీలేదు. దృగ్ బ్రహ్మ పోతే దానితోనే దృశ్యబ్రహ్మ పోవును. ఎప్పటి బయలే స్వతస్సిద్ధమై యుండును.

శి : జగత్తు మిధ్య. పుణ్యపాపములు మిధ్య. బంధమోక్షములు మిధ్య అని అనవచ్చునా?

గు : తెగబడి నరికేవానికి కరిఏమి ? తురంగమేమి ? కాల్బల మేమి ?

కం: అంతాసరి, యింతాసరి, హంతకునకు, మధ్యపాన కాభ్యాసునకున్ ! అంతాసరి, యింతాసరి, చింతించక యిచ్చు దాన చింతామణికిన్" అని చెప్పబడినట్లుగా, రాజైతేనేమి? తానే లేననేవానికి, జగత్తు లేదంటే నేమి ? సచ్చిదానందములు కల్పనంటేనేమి ? అర్ధస్వరూపం అబద్ధమంటేనేమి ? పుణ్యపాపాలూ, బంధమోక్షాలూ ఏమీ లేవంటేనేమి? ఏమిభయము ?

శి : ప్రాపంచీకులకు యీమాటలు రుచించునా ?

గు : రోగమువచ్చినవానికి అన్నమనర్ధకము. అలాగే ఈ మాట పామరునికి విషము.

శి : ఆనంద మెక్కడ నున్నది ? ఎట్లు పొందవలెను ?

గు : ఎక్కడోయేమి ? బుద్ధినిలిస్తే స్వరూపానందమేగదా, కాని కామాంధునకు స్త్రీ దేహమందు, మాత్రమే దోచును. యోగికి సమాధియందు మాత్రమే కాన్పించును. ఐతే తనయందు వున్నదే దానియందారోపించును.

శి : ఈ మర్మమంతా యెట్లు తెలియనగును ?

గు : తెలిసిన వారివద్దకు పోతే తెలుసునుగాని వట్టివారి వద్దకుపోతే, యేమి కలదు ? తల్లి స్తన్యపానమువల్ల శిశువు జీవించునుగాని తండ్రి స్తన్యపానమువల్ల జీవించునా ?

శి : సర్వమునందూ వున్న ఆత్మకు ఒక స్థానమని యేల చెప్పవలె ?

గు : అవును అట్లు చెప్పకూడదు.

శి : ఏదో స్థలము చెప్పకుంటే మనస్సు నిలువదు అని చెప్పినారేమో !

గు : అట్లైతే భూ మధ్యమందు అని చెప్పకుంటే శ్రోత్రములే స్థానమని చెప్పకూడదా ? సూర్యప్రతిబింబము జలమున్నచోటే వున్నట్లు బిందుదర్పణ మందే ప్రతిబింబించి జీవుడనిపించుకొన్నాడు. ప్రతిబింబరూపుడైన జీవునికి స్థానం చెప్పవచ్చునేగాని ఆత్మకు స్థానము చెప్పరాదు.

శి : ఐతే, చిదాభాసుడు వేరూ, చిత్తు వేరూనా ?

గు : తానే రెండూ, ఏమీలేదు, స్ఫటికములలో దారమున్నట్లు తనుత్రయమునందూ ఒక్కటే ఆత్మయున్నది.

శి : శరీరాలతో నిమిత్తం లేకుండా ఆత్మయొక్కటేయేల ప్రకాశించరాదు ?

గు : కండ్లు మనస్సూ రెండూ వుంటేగాని సూర్యుడు గాన రానట్టు వుపాధి ద్వయముంటేగాని ఆత్మప్రకాశించదు. లేకుంటే ఏమీ లేదు.

శి : లేదు. ఐతే అసలేమీ లేదా ?

గు : ఇసుకయందు ఒక పాత్రనుంచి తీసుకొనిపోతే అర్వది వుండును. ఉంటే ఆవస్తువు అక్కడ ఉన్నట్లు ఏలాగున కాదో అలాగే, యెరుక మార్గము తెలసి యీ మార్గము దెలిస్తే యేభ్రాంతీ వుండదు. అధికారే విరిశిపోవును.

శి : అది ఏలాగు ?

గు : సున్నపురాయి రాయివలెనే వున్నా, జలసంయోగం చేత విరిసిపోయినట్టుగానే అని తెలియవలెను. వట్టి పాషాణమందు ఎంత వుదకంపోసినా ఒక్కతీరే. (ఎరుక స్వరూపజ్ఞానం తెలిసినవాడు సున్నపు రాయిలాంటి వాడు).

శి : అయితే యెరుకమార్గమందే ఏల నుండరాదు ?

గు : యెరుక యెరుకమార్గంచేతపోదు. ఏలాగంటే సూర్యుడు ఎంత తీక్షణముగా ప్రకాశించినా జలమందున్న కమలం చెడదు. చంద్రుడు చల్లనివాడైనా చెడకొట్టును.

శి : రెంటి భావాన్ని తెలుసుకొన్నాక ఎరుకను వీడకపోతే నేమి ? తెలుసుకొని వూరుకుంటే చాలదా ?

గు : ఎరుకనే నమ్ముకొని వుంటే తల్లిని అమ్మి దాసీని కొన్నట్టు అవును కంచము అమ్మి మట్టెలు కొన్నచందమగును. ఎంత కష్టంలోనైననూ సింహం వట్టిగడ్డినితినునా ?

శి : యెరుకను వీడకుంటేనేమి జరుగును ? వీడినచో కల్గు ప్రయోజనమేమి ?

గు : యెరుకను వీడకుంటే సంశయ విపరీత అసంభావనలు బాధిస్తూనే వుండును. యెరుకను వీడితే సర్వభ్రాంతి రహితమే.

శి : కొంతమంది ఎరుకకే మ్రొగ్గుచుంటారు. యెందుకోమరి ?

గు : సూకరాదులకు భక్ష్యభోజ్యములు ముందున్ననూ వానివృత్తి అవిమానలేవు. సుగుణం స్వాభావికముగానే పుట్టవలెను. అగంతుకమైతే నిలువదు.

శి : ప్రకృతి పురుషులలో ప్రకృతి అబద్ధమనటానికి వెనుదీయరు కాని పురుషునియందు నమ్మిక వీడలేరు.

గు : పాము చుట్టమూ; పడగమాత్రము పగ అన్నట్టుగానే వుంది. చిత్తే పురుషుడు. చిత్తుతోనే మత్తువదలును. బింబము లేకపోతే ప్రతిబింబమప్పుడేలేదు. వున్నదన్నా వినరాదు. చిజ్జడములు బ్రహ్మమనుటకు సిగ్గుకాదేమో.

శి : చిజ్జడరహితమైన పరిపూర్ణ మెట్టు కానవచ్చును ?

గు : కానరాని నిర్గగద్వ్యోమ కనిపిస్తుందనటం భ్రమ. అదితేజోంధకార రాహిత్యమైనది. సూచనచే, సూక్ష్మంగా గ్రహించవలసినదే.

శి : యుక్తులు చెప్పినంత మాత్రాన యెరుక రహితమగునా ?

గు : చలిచీమలచేత బలమైన సర్పము నశించినట్లే యుక్తుల చేతనే యెరుక భ్రాంతిరహితమై, పరిపూర్ణ భావం దృఢమగును.

శి : అట్లే బలీయమైన మరికొన్ని యుక్తులచే పరిపూర్ణ భావముకూడ బాధింపబడవచ్చును అని ఏల అనరాదు.

గు : ఎరుకేలేని పరిపూర్ణమువట్ల యెరుకయుక్తులు నిష్ప్రయోజనము సామాజాన్ని మశకములు మత్కుణములు ఏలాగున చంపలేవో బోధ దృఢమైన వానికి దుర్బోధ లేమీ నాటవు.

శి : పరిపూర్ణ భావజ్ఞు డెట్టి శీలసంపత్తి గల్గియుండును ?

గు : పరిపూర్ణము నిర్వికల్పమైనది. కనుక కల్పనలేనిదే కైలాసమని, వికల్పములేక నిర్భయస్థితిలో నిలకడ కల్గియుండును ? తన్మమర్మము తెలియుటే నీతి. తన త్యాగమే త్యాగం. మిధ్యాత్మనిశ్చయమేశీలం ఆత్మత్యాగమే సమర్పణ. నిశ్చేష్టితమైన మౌనమే నమస్కారము. మోహభయ త్యాగమే తీర్థాది గ్రహణం. త్రైకాలి కాహంకార శూన్యమే ప్రసాదము.

శి : ఎందుకో, నిష్కారణంగా యీ బోధను దూషిస్తూ వుంటారు ?

గు : దూషిస్తే నేమి ? కోపంతో కొండను గ్రుద్దితే పొట్టేలు కొమ్ములే విరుగును కాని కొండకేమి బాధ ? ఎరుక బోధపరులు పరిపూర్ణమును దూషిస్తే వారలే చెడుదురుగాని పరిపూర్ణమునకు లోపంరాదు.

శి : ఈబోధ ఎవరికి చెప్పితే ప్రయోజనముండును ?

గు : మొదలు పండిలవారికి (అనగా ఆత్మజ్ఞానంచే పరిపక్వాంతఃకరణ గలవార్కి) చెప్పవలె. వరి పండిన పిదప ధాన్యమేలాగు అక్కరకు వచ్చునో అలాగే జన్మాంతర వశాత్తూ పక్వమైన అంతకరణకు భక్తి స్ఫుటముగా బుట్టి మొదలు పండును. పండిన పిదప తొడిమ వూడి పండుయేలాగున క్రిందపడునో అలాగే యెరుకపట్టు తేలికగా వూడియే భ్రాంతులూ లేకపోవును. కనుక యెరుక మార్గము తెలిస్తేనేగాని యీమార్గము దృఢముకాదు. బాలునికి ముందుగానే వేదశాస్త్రములు అక్కరకు రానట్లుగానే, అని తెలియవలెను. ఐనను ఎరుకను మాత్రం దెలుసుకుని నమ్ముకొని వూరుకొన్నవారికి ముక్తిలేదు. పాషాణంలో చేసిన తెప్పతో సముద్రం ఈదుటకు ప్రయత్నించిన చందమగును.

శి : ఐతే పరిపూర్ణ బోధ విన్నవారందరూ తరింతురా ?

గు : ఈబోధ ఎంతచెప్పినా వానికి ప్రాప్తి లేకుంటే అబ్బదు, ఔషధము యెంతదండిదైనా మరణమును యెట్లా బాపలేదో, అట్లాగే.

శి : ఐతే, గురువాక్యం వ్యర్థమై పోవలసినదేనా ?

గు : కాదు. తుమ్మెద కఠినమైన వృక్షమునూ దొల్చును, మృదులమైన శిరీష పుష్పములయందు మకరందమునూ పానము చేయును. అలాగే కఠినమునకు కఠినము; మృదుత్వమునకు మృదుత్వము, గురువాక్యము ప్రాప్తం లేకుంటే దృఢంకావడం కష్టం. ఇది పట్టులేని పరిపూర్ణ బోధ కనుక పొందడంకఠినం.

శి : అంత కఠినమైనది సాధించకపోతేనేమి ? ఎరుక పోనంత మాత్రంచేత ఏం బాధ ?

గు : పాముకు కొనవూపిరి వున్నా పగ ఏలాగున పోదో, పెనిమిటి వుండగా ఎంతతిట్టినా ముండయెట్లాకాదో; జలంవుండగా ద్రవత్వం, వాయువుండగా స్పర్శ యేలాగున పోవో, ఆలాగే, ఎరుక వుండగా మాయ పోదు. రాకడ పోకడలు తప్పవు. యెరుక వున్నంతసేపూ వస్తూ వుండును.

శి : సరే ఎరుక పోతేనే, లభిస్తుందన్నమాట.

గు : లభించటానికి ముక్తి అనేది ఒక భావరూప పదార్థము కాదు. కనుక పొందడమనేది ఏమీలేదు. భావాభావములు రెండూ తానే, తాను లేకపోతే ఏమీలేదు. ప్రాణమున్నంతసేపు ఎంత బిగబెట్టినా ఎలాగునకదలుతువుండునో అలాగే ఎరుక వున్నంతసేపు రాకపోకలు తప్పవు. కనుక యెరుక పోవడమే ముక్తివాచ్యము.

శి : యెరుక యెటువంటిదంటే --

గు : కమ్మరవీధిని గంటలమ్మ బోయినట్లు. పరిపూర్ణుల ముందర కొందరు యెరుకను వర్ణింపబోతారు, అదే సర్వద్వంద్వాలుగానూ వున్నది. సూర్యునికి దివారాత్రములు లేనట్లు పరిపూర్ణులకు సవికల్ప నిర్వికల్పములు, విద్యావిద్యలు, దృగ్దృశ్యములులేవు. పామరులకు వున్నట్టే కనుపించును ?

శి : అది వారికిస్వాభావికమా ? ఆగంతుకమా ?

గు : చంద్రునకు చంద్రికా, సూర్యునికి ఆతాపము (యెండ) స్వాభావికమై యున్నట్లే స్వాభావిక మేగాని ఆగంతుకం కాదు. ఏలననగా ఆ ద్వంద్వములన్నియు ఎరుకతోనే పోయే. కనుక వారికి లేకవుండుటే స్వాభావికము అనవలె. అదివరకు లేనిది క్రొత్తగా వస్తే ఆగంతుకం. పోయినదేదో పోయినది. కాని కొత్తగా ఏమీరాలేదు.

శి : పరిపూర్ణ మెరుకలలో యేదిదేనిని ప్రకాశింపచేయును ?

గు : పరిపూర్ణము దేనినీ ప్రకాశింపచేయదు ప్రకాశింపచేసే ఎరుక లేనేలేదు.

శి : స్వామీ మీవద్దకు వస్తే మొదలే లేకుండా చేస్తారు. బేరసారములు అన్నీ పూర్తి అయ్యాక ధాన్యం కొలవ మంటే మానిక బోర్లవేసి కొలత ప్రారంభించెనట్లు. యిదేమి అన్యాయం

అని రాజుగారితో ఫిర్యాదుచేస్తే రాజుగారామానిక తెప్పించి -- "తప్పుకొలత కొలవరాదు. మానిక వడ్డిగిల (పరుండ) బెట్టికొలు" అన్నాడుట. అలాగే దేహముకావు నీవాత్మవేనని చెప్పి అపైన ఏమీ లేకుండా చేస్తిరే !

గు : ఆశ్చర్యమెందుకు ? వున్నదున్నట్టుగా, లేనిదిలేనట్లుగా చెప్పినాం.

శి : ఎరుక మార్గములు, సోపానక్రమంగా నైనా అచలప్రాప్తి కల్గించునా ?

గు : కల్గించవు ఎరుకబోధలచేత మహత్తు కల్గును ఈ అచలమార్గం ప్రాపంచీకులకు తెలియనీయరాదు ?

శి : ఎందువలన ?

గు : కాకులలో హంసకూడితే బాధజెందును. పదిమంది దురాచారులలో ఒక సదాచారి చేరితే వానినందరు అపహాస్యము చేతురు.

శి : యిన్ని యుక్తులు ఎందుకు చెప్పవలెను ? సాధన చేయవలెగాని మాటలతో ప్రయోజనమేమి?

గు : సిద్ధాంతం దృఢంగా నాటుకొనుటకు యుక్తులేకావలెను. సాధనలచేత దృఢమయ్యేది కాదు. మూడేండ్లు సాముచేసి మూలనున్న ముసలిదానిని పొడిచి సాధించినట్లుగా కృతచం ద్రాయణములున్ను అష్టాంగయోగములున్ను చేసి తాను తానైతినని సంతోషింతురు. ఎరిగినా తానుతానే, యెరుగకున్నా తాను తానేగాని అన్యుడు కాదుగదా! అంతమాత్రమునకు యింత ఆయాసమెందుకు ? కాశీకిపోయి కొంగ మలము తెచ్చిన సామ్యము.

శి : త్యాగమువల్లనే ముక్తి అంటారుగదా ! దానిమాట ఏమి ?

గు : తన్నే త్యాగము చేసుకోవలె "అహంత్యాగే తను త్యాగే అహందేహ మసంశయ :"

శి : అట్టి త్యాగము చేసినవారెట్లుందురు ?

గు : అట్టివారిని అందరూ తెలిసికోలేరు "విద్వానేవ విజానాతి, నిద్వజ్జన పరిశ్రమం, నహివంధ్యా విజానాతి, గుర్వీం ప్రసవవేదన" అన్నారు అనగా పండితులు చేసిన కృషి పండితులకే తెలుస్తుంది. ప్రసవవేదన సంగతి గొడ్రాలికెట్లు తెలుస్తుంది. కనుక లేనివానికే యెరుక వున్నవానికి తెలియదు. అనగా అజ్ఞానముచే కప్పబడిన వాడుఎరుగడు. వానికి సద్వాక్యము విరోధము. చంద్రుడు చల్లనివాడైనా విరహిణులకు విరోధి. అధికారముకొద్దీ మాత్రమే గ్రహింపగలుగుతాడు. ఆవరణం కలిగిన వజ్రం పరీక్ష రానివానికి పలుగురాయివలెనే వుంటుంది.

# పరిపూర్ణబోధ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

(గురు-శిష్య సంవాదరూపం)

## షట్ప్రమాణ నిర్ణయ ప్రకరణము

గు : బీజరహితము, నిశ్చలము, నీరంధ్రము, నిరంజనయందు నిప్పువున్న దనిన్ని ఊహించి చెప్పుట అనుమాన ప్రమాణమనిచెప్పబడును.

శి : అనుమాన ప్రమాణమునకు మరికొన్ని దృష్టాంతములు చెప్పండి స్వామీ ?

గు : హింగుదీన్యాయము అనగా చాటునవున్న ఇంగువను వాననచే కనిపెట్టుట శీతోదకభాండముజూచి, ఆకుండయందు ఇంతవరకు నీరున్నదని చెప్పుట, ముఖముజూచి రోగగ్రస్తుడని నిర్ణయించుట స్థాలీపులకన్యాయముగ ఒక మెతుకునుబట్టిచూచి అన్నమంతా అట్లేయుండుననుట యివి అన్నియు అనుమాన ప్రమాణమునకు నిదర్శనములే.

శి : యీవిధంగా పరిపూర్ణము తెలియబడదా ?

గు : పరిపూర్ణము ఏకదేశస్థితమైన అగ్నివంటిదికాదు. కనుక అనుమానమెట్లు కుదురును? అంతేకాక దృష్టాంతములలో చెప్పబడిన వస్తువులవలె అది సావయవముగాదు. గుణముంటే వస్తువును గుర్తించవచ్చును. పరిపూర్ణమునకు గుణమేలేదు. అది శుద్ధనిర్గుణముకదా !

శి : ఉపమానప్రమాణమెట్లు కుదరదు ?

గు : ఉపమానమనగా : 1) గోసదృశోగవయః : గవయు, మృగము గోవువంటిది 2) చంద్రవన్ముఖం = ముఖము చంద్రబింబము వలెనున్నది. 3) కమలవన్నేత్రం = కండ్లు కమలపత్రములవలెనున్నది. 4) కంబువత్కంఠం = కంఠము శంఖమువలెనున్నది. యిట్టి వుపమానములను బట్టి వస్తువులు గుర్తించుట గవయ మృగము గోవువంటిదేగాని గంగడోలుమాత్రముండదు. అని చెప్పగావిని. యిది గోవువలెనున్నది. కాని గంగడోలు లేదు కనుక యిదే గవయ మృగమని తెలుసుకొనుట వుపమాన ప్రమాణముచే వస్తువును గ్రహించుటయగుచున్నది. పరిపూర్ణమువంటిది మరియొకటి లేనేలేదు. కనుక వుపమాన ప్రమాణము పనికిరాదు.

శి : శాబ్దిక ప్రమాణ మెట్లు ప్రయోజనకారి గాదో వివరించండి స్వామీ !

గు : శాబ్దిక ప్రమాణమంటే శ్రుతి స్మృతులలో చెప్పబడిన దానిని నమ్మియుండుట శాబ్దిక ప్రత్యక్షము. బ్రహ్మసూత్రములతో "శాస్త్రయోనిత్వాత్".అను సూత్రరీత్యా, బ్రహ్మము వేదైక వేద్యమని కూడా చెప్పబడినది. ఐతే శ్రుతి : "యతో వాచోనివర్తంతే అప్రాప్య మనసాసహ" అనగా వాంగ్మనస్సుల కతీతము కనుక శబ్దముచేత పరిపూర్ణము తెలియశక్యముకానిది కనుక శ్లోకం ॥ వాచాతీతం మనోతీతం, భావాతీతం, నిరంజనం। జ్ఞానాతీతం ××× అని కూడా చెప్పబడిన పరిపూర్ణ పరబ్రహ్మము శాబ్దిక ప్రమాణ గమ్యమున్నూ కాదు.

శి : అర్థాపత్తి ప్రమాణమనగా యెట్టిది !

గు : దేహేంద్రియ మనః ప్రాణములచేత గుర్తురెగుటకు శక్యముకాదు కనుక స్వయం వేద్యముగా తెలియబడవలెనని అద్వైత నిర్ణయము. ఐతే అన్యసహాయము లేకుండా నేత్రములు తమ్ము తాము గ్రహించగలవా ?

శి : ముకురము (అద్దం) సహాయముతో నేత్రములను నేత్రములు గుర్తెరిగినట్లు, మనస్సుచే ఆత్మను గుర్తించవచ్చునుగదా !

గు : "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుశృతిచేత ఆత్మకంటె అన్యము చెప్పకూడదు. మరిన్ని "సాధానాంతర నిరపేక్ష స్వయం ప్రకాశం బ్రహ్మ" అన్న శృతికిన్ని విరోధము గనుక ఆలాగు చెప్పుట యుక్తముకాదు.

శి : పోనీ "గంగాయాం ఘోష :" అని చెప్పబడిన చోట ((గంగాతీరేఘోష :" (అనగా గంగయందు గొల్లపల్లి అని చెప్పినపుడు (గంగాతీరమందు) అని లక్ష్యార్థము గ్రహించినట్లు జహర్లక్షణ (ఒకటిత్రోసివేసి) గుర్తెరుగవచ్చునేమో.

గు : సర్వవ్యాపకమైన దానియందు దేనిని యెక్కడకు త్రోసివేయవలెను ?

శి : అయితే అర్థాపత్తి అను దానికిమీరేమి చెప్పతారు స్వామీ !

గు : ఎరుకవుండి పరిపూర్ణము ఎరుగవలెనంటే, యెరుక ఒకటి. పరిపూర్ణమొకటి అను రెండు వున్నవని చెప్పవలసివుండును. పోనీ యెరుక విడిచిపెట్టి యెరుగవలెనంటే యెరుక లేకుంటే యెరుగ శక్యముగాదు.కనుక యెరుక యొక్క సాధనలద్వారా తెలిసేది కాదు. కనుక అర్థాపత్తి ప్రమాణముచేత పరిపూర్ణము ఎంతమాత్రము తెలియబడదు.

శి : అనుపలబ్ధి ప్రమాణము పరిపూర్ణ పరబ్రహ్మము విషములో ప్రయోజనకారి యగునా?

గు : అనుపలబ్ధి అనగా అద్వైత పక్షములో అపరోక్షసాక్షాత్కారము చెప్పబడినది. ఐతే, తనకు మునుపు లేనట్టున్ను యిపుడు తనచేత తనకు అట్టి సాక్షాత్కారమైనట్టున్ను చెప్పకూడదు. మునుపు తాను అపరిశుద్ధుడైన జీవుడైవుంటే యీవేళ తనయొక్క సాక్షాత్కారముచేత పరిశుద్ధమైన ఆత్మతత్వము తనకేలాగు సంభవించును ? కనుక అలాగున చెప్పగూడదు.

శి : లక్ష్యార్థములో పరిపూర్ణం "సాధనాంతర, నిరపేక్ష సర్వకాల, సర్వావస్థాను దృశ్యా దృశ్య విలక్షణ స్వతసిద్ధ సాక్షాత్కారము" అని చెప్పినది సరియగునా ?

శి : కాదు - పరిపూర్ణము దేనికి సాక్షాత్కారమని చెప్పవలెను ?

గు : గుర్తెరిగే శరీరమునకే సాక్షాత్కారమున్ను అని చెప్పవలసినదే ?

శి : గుర్తెరిగే శరీరము అత్యంతా భావమైతే దానికి సాక్షాత్కారమేమి ? మరిన్ని శరీరములేనిది, శరీరముచేతయెట్లు గుర్తెరుగటకును ? అంతేకాకుండా, ఒకటి ఆధారభూతమైతేనేగదా శరీరమనే పేరురావడం ? అది ఎవరికి శరీరముగా నున్నది ? వున్నదానికా లేనిదానికా? ఉన్నది, శరీరము లేకనేయున్నది, లేనిది లేకనేపోయె ?ఈ గుర్తెరిగే శరీరముదేనిది లేక యెవరిది ?

శి : దానికదే.

గు : దానికదే, శరీరము అనుట అసంభవము.

శి : పరిపూర్ణమునకే యిది శరీరమంటేనో ?

గు : అట్లనరాదు. పరిపూర్ణము త్రివిధ పరిమాణ శూన్యమైనది.

శి : అది ఏలాగు ?

గు : అణువుయొక్క అంతర్బహిస్సుల యందున్నది కనుక అణుపరిమాణము కాదు. మధ్య పరిమాణమైన నర, మృగ, పక్షి, క్రిమి కీటకాదులు మొదలైన చరాచరములయొక్క అంతర్బహిస్సుల యందున్నది కనుక మధ్య పరిమాణమున్ను కాదు. మహత్పరిమాణమైన, ఆకాశాదికములను, కారాదులను, అతిక్రమించి వాని యొక్క బాహ్యాభ్యంతరముల యందున్నది కనుక మహాత్పరిమాణమున్ను కాదు త్రివిధ పరిమాణ శూన్యమైన పరిపూర్ణమునకు త్రివిధపరిమాణ సహితమైన పరిపూర్ణమునకు యెరుకశరీరముకాదు. శరీరమువికార స్వరూపము గనుక గుర్తెరిగితిని అనే వికారము దానికి తోచును.పరిపూర్ణముకంటె అన్యము లేదు. దానివంటిది అదే,నిరావరణవత్, శరీరమే శూన్యము గనుక అది (ఎరుక) యెప్పుడూ లేదు. గనుక ఒకదానికది శరీరము కాదు. యిదే గురూపదేశము. అన్నీ ఎరుకే కనుక అన్ని ప్రమాణములు దానికే అత్యంత విలక్షణమగు పరిపూర్ణమునకు యేమీలేదు.

శి : ఎరుక కూడ సత్యవ్యాప్తమన్నారు కదా ?

గు : ఐతే కానరావలెనుగదా,

శి : నీకు కానరాదు. నాకు కానవచ్చునన్నారు.

గు : మోచేతికి బెల్లంబెట్టి నాకమన్న చందముగానున్నది.

శి : ఏమి అట్లా అంటున్నారు ?

గు : ఎరుక సర్వవ్యాప్తమంటే అసంభవము,అవ్యాప్తి అతివ్యాప్తి దోషములు వచ్చును.

శి : యీ దోషములను యించుక విశదీకరించండి స్వామి !

గు : "మహిషా : కింవాలక్షణం ?" (గేదె జాతికి లక్షణమేమిటి ?) అనిప్రశ్నిస్తే "ఏకఖురత్వం లక్షణం" (అనగా ఒకడెక్క వుండుట లక్షణం) అని జవాబు చెప్పుట అసంభవము. పరిపూర్ణమందు ఎరుకకాని ఎరుక గుణములుగాని వున్నవనుట అట్లే అసంభవం.

శి : అతివ్యాప్తి, అవ్యాప్తి దోషము లేవి ?

గు : గో : కింవాలక్షణం ? (గోవుల లక్షణము లేమి ?) అంటే - శృంగిత్వమనుట (కొమ్ములుండుననుట) అతివ్యాప్తిదోషము. ఏలననగా గేదెలకున్ను కొమ్ములుండును గదా ! అట్లే పూర్ణత్వమొక్క పరిపూర్ణమందే యుండుట ప్రసిద్ధమై వుండగా, ఎరుక యందుకూడా పూర్ణత్వమున్నదనరాదు. "గో:కింవాలక్షణం" అంటే కపిలత్వం అనిచెప్పుట, అవ్యాప్తి దోషము. ఏలననగా గోవులన్ని నల్లగావుండవు. అనేక రంగులలో నుండును గదా కనుక గోవులకు కపిలత్వం లక్షణంగా చెప్పుట అవ్యాప్తి. పరిపూర్ణమునకు సాటిలేదు. అటువంటిది అదేగాని రెండోదిలేదు. పరిపూర్ణలక్షణములు ఎరుకయందుగాని ఎరుకలక్షణములు పరిపూర్ణమందుగాని వున్నట్లు చెప్పరాదు.

శి : ఆ పరిపూర్ణమును ఎట్లు చెప్పవలెను ?

గు : స్వతస్సిద్ధమైన పరిపూర్ణమునకు షడ్వికారములులేవు. పరిపూర్ణమైనదానిని చెప్పుట యెట్లా? చెప్పవలెను ? ఆ పదార్థమైనదానిని చెప్పుట యెట్లు ? దానియందు ఏ పదార్థములు కూడా లేవు.

శి : శ్లో ॥ "ఏకం బాహ్యం, సదానిత్యం, అన్యం నాస్తి అహర్నిశం" అని చెప్పినారు గదా చెప్పరానిది అంటారేం ?

గు : దానియందు శబ్దంలేదు. కనుక శబ్దముచే చెప్పరాదు.

శి : శబ్దమున్నట్లు ఒకప్పుడు తోస్తూనేవుందిగదా ?

గు : అంధకారమున్నపుడూ పరిపూర్ణపర బ్రహ్మమున్నది. సూర్యోదయానంతరమూ పరిపూర్ణపరబ్రహ్మమున్నది. ఒకప్పుడుండి మరొకప్పుడు అంధకారం లేకపోవుచున్నది. పరిపూర్ణము మాత్రము అహర్నిశలయందువున్నది. కనుక అంధకారము పరిపూర్ణమందు లేదని చెప్పవలెను.

శి : ఐతే అంధకార మెచ్చటనున్నది ?

గు : నీయందున్న అజ్ఞానతమస్సులు దానియందు యారోపిస్తున్నావు. గాని దానికి స్వతహాగా తమస్సు అనేమాటేలేదు. నేత్రముల యందే తమస్సు వున్నది యిది పరమమర్మము.

శి : ఈ జ్ఞానాజ్ఞానములెట్లు వస్తూపోతూయున్నవి ?

గు : పిపీలికాది బ్రహ్మపర్యంతం అన్నీ ఎరుకయందే ఏలా వస్తూ పోతూనున్నవో, అలాగే అజ్ఞానాజ్ఞానములున్ను యివన్నీ దీనిలక్షణములేగాని అదియెప్పుడూ ఒక్కతీరే కనుక దానిని యిటువంటిది అని చెప్పరాదు.

శి : చెప్పకపోతే ఎలా గ్రహించవలెను ?

గు : లేనిదానిని లేకుండా చెప్పడమేగురునివంతు. పరిపూర్ణము, లేనెరుక అను రెంటిలో లేనెరుక లేదని నిరూపిస్తే శిష్యుడు స్వతస్సిద్ధమైయున్న పరిపూర్ణమును గురువు చెప్పనక్కర లేకనే గ్రహించి చెప్పుక్రింద తేలు అణిగియున్నట్లే (అనగా, కుట్టుటకు చేతకాకనే) యుండును. యింతేగాని యేశ్రుతిస్మృతి శాస్త్రాదులున్నూ ఏమియు పనికిరావు.

శి : పరిపూర్ణమందు ఎరుక జగములు ఏరీతిగానున్నవి ?

గు : వెన్నెలలో వెలగకాయవున్నట్లు సమస్తమున్నూ అందులోవుండి వస్తూ పోతూవుండును. మేఘమందు మెరుపు, చరాచరము, వస్తూపోతూ వున్నట్లుగానే వుండును.

శి : ఈ దృష్టాంతములేమీ అర్థంకాలేదు స్వామీ !

గు : కారుచీకటిలో కనపడని వెలక్కాయలు వెన్నెలలో కానవచ్చి తిరిగి చీకటిలో మాయమగుచున్నవి. వెన్నెలవంటి ఎరుక ప్రకాశములో బ్రహ్మాండభాండములు తెలియబడి ఎరుక యొుక్క అప్రకాశస్థితియందు (అజ్ఞానలక్షణమందు) కానరాకుండాపోతున్నవి. అట్లే మేఘము క్రమ్మియున్నపుడు ఏమీ కానుపించని చరాచరములు, మెరపువచ్చుటతోనే ప్రకాశమానమై మరుక్షణములో లేకపోవుచున్నవి. అట్లే యెరుకయొుక్క ప్రకాశా ప్రకాశములయందు, జగములన్నీ అవిర్భావ తిరోభావములు చెందుచున్నవి.

శి : కొందరు కలదృష్టాంతము చెప్పుతారుకదా !

గు : అవును. గురుకృపచేత కలమేలుకోవలెను అంతవరకుయీ భ్రాంతివదలదు. ఈయెరుకనే కలమేలుకొంటే ఏకలాలేదు. గురుమంత్రముచే యీకల నిలువదు.

శి : గురుమంత్రప్రభావమును కొంచం వివరించండి స్వామీ ?

గు : ఎంతనీరుగల మేఘమైనా, ప్రచండానిలముచేత ఎక్కడ నీరు అక్కడే హరించినట్లు, అది క్రిందపడకుండా, మధ్యలేకుండా, పైకిపోకుండా ఎక్కడిదక్కడే ఏమీలేకుండా పోవును. అలాగే గురువాక్యము గురునిష్టకంటె ఎక్కువలేదు. ఏమీలేకపోవును.

శి : గురుకృపచే గుర్తెరిగే శరీరము లేనేలేదని యెరిగి ఈ బోధదృఢమైనవారి అనుభవమేమి?

గు : అంతర్బహిస్సుల తానులేక స్వతః పరిపూర్ణమైన బట్టబయలే వుండును.

శి : అట్టి స్థిత్యానుభవమునకు ఏసాధన చేయవలెను.

గు : స్వతస్సిద్ధమైన పరిపూర్ణమునకు ఏ సాధన అక్కరలేదు. ఏలాగంటే ముంజేతి కంకణమునకు అద్దమక్కరలేనట్లు ఈ మార్గమును తెలసి, తెలిసింది తెలియకపోయెనట్టాయెనా, నిరావరణ భావము స్వతస్సిద్ధము.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురు-శిష్యసంవాదము

## గుహ్యాద్గుహ్యాపరమోపదేశ ప్రకరణము

గు : నిర్లేపము నిత్య సంపూర్ణము నిరాధారము పరాత్పర నిర్వికారము అయిన పరిపూర్ణములో ఎరుక పుట్టినదని వానియందు నశించుచున్నదని వేమన చెప్పినారు.

శి : ఇతరులు మరొక రీతిగా చెప్పినారా ?

గు : అవును "ఇదిఅది అవుతుంది అదిఇది అవుతుంది" అని అల్లమా ప్రభువూ కృష్ణుడూ అన్నారు.

శి : శివరామదీక్షితులవారు ఏమన్నారు ?

గు : అది ఇది కాదు ఇది అది కాదు అని అన్నారు

శి : మరి ఇంకా ఎవరైనా తేడాగా చెప్పినారా ?

గు : ఇది పుట్టలేదు అదికాదు అని దక్షిణామూర్తివారు తూష్ణీభూతముగా భావసూచన చేసినారు

శి : ఈ నాలుగు మార్గములు వాస్తవమేనా ?

గు : దానియందు ఇది పుట్టినదని చెప్పకూడదు. విలయమును చెప్పకూడదు అని శివరామదీక్షితులవారు.

శి : చెప్పకపోతే పరిపూర్ణముకు హానిరాదా ?

గు : ఏలా చెప్పినా ఏమి చెప్పకపోయినా పరిపూర్ణముకు హానిరాదు.

శి : అది ఏలాగు ? పరిపూర్ణముకు హానిరాదు కాని సిద్ధాంతమునకు హాని వచ్చునుగదా ?

గు : దీనంతట ఇది పుట్టెను దీనంతట ఇది లీనమైతినని అనుకొనెను అన్నీ దీని వికారములే కాని అది ఏమి ఎరుగదు దానియందు ఎఱుక లేదు.

శి : మూలము లేనిది ఏది ?

గు : "నిర్దేహమును చూచే దేహమునకు మూలము లేదు అని విచారించినప్పుడే దేహాంతము. అన్యమైనది దేహాంతము కాదు.

శి : నిర్దేహము అనగా ఏమి ? పరిపూర్ణమా ?

గు : నిర్దేహము చూచుట అనగా దేహములేని శూన్యస్థితిని గుర్తించుటయే. అది పరిపూర్ణముగాదు. శూన్యస్థితియే. అశూన్యస్థితిని గుర్తించిన గుర్తెరిగే శరీరమునకు మూలం లేదు. ఇది గుర్తించినపుడే దేహాంతం.

శి : పరిపూర్ణబోధలో యెన్ని మార్గములు ?

గు : నాలుగు మార్గములున్నవి. రాజయోగమందు సాంఖ్య తారకా మనస్కజ్ఞాన మార్గములు ఏలాగో అలాగే ఆ నాలుగు మార్గములకు నాలుగు దీక్షలున్నుయున్నవి.

శి : ఆ నాలుగు మార్గములు ఏవి ? వానికి చెప్పబడిన దీక్షలేవి ?

గు : 1) అఖండ నిర్దేహ విలీనము 2) అనుపమాన సర్వలయము 3) అద్వితీయ పరిపూర్ణస్థితి 4) జ్ఞానరహిత తూష్ణీభూతసంగ స్థితి అని నాలుగు మార్గములు. యోగ మార్గమందు స్వస్తికారోహణ స్పర్శబ్రహ్మదీక్షలున్నట్లు అనాలుగు మార్గములకు నాలుగుదీక్షలు, నిశ్చల సమయదీక్ష, నిరామయ నిర్వాణదీక్ష అద్వయామలదీక్ష నిరంజన తూష్ణీభూత పరిపూర్ణదీక్ష.

శి : ఒక్కొటొక్కటిగా యీ నాలుగు మార్గములను వివరించండి స్వామీ !

గు : 1) అఖండ నిర్దేహ విలీనము. అనగా

శ్లో ॥ సర్వేంద్రియ వినిర్ముక్తా విజ్ఞానస్వచనాశనం

తదేవాఖండ నిర్దేహ విలీనమితి కథ్యతే:

శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ, వాక్ పాణి, పాద, గుహ్య, గుదము, లున్ను మనస్సున్ను యీ యింద్రియము లన్నింటియందు చేరక వానిని విడచిపెట్టిన తెలివియే యెరుక. అది పరిపూర్ణమందు లీనమై లేక పోవుటే అఖండజ్ఞానము. దీనికి మూలము లేదని యెరుగుటయేదాని నాశనము. యిదియే అఖండనిర్దేహ విలీనత్వమని చెప్పబడుచున్నది. కంబయలందు పుట్టుసర్వము బయలందే లీనమౌను. బ్రహ్మంబనగా బయలనిమదిలో దెలిసిన, బయలంటే ముక్తి బట్టబయలగునేమా ?

శి : అనుపమాన సర్వలయమంటిరే ! ఆ మార్గమేమి ?

గు : శ్లో ॥ ఆత్మానం వ్యోమ మధ్యేచ,వోమం చాత్మని యత్కృతం, తదే వహ్యానుపమానస్య సర్వలీనమితీరతం॥ వ్యోమమనగా మనస్సు, ఆత్మ మనస్సునందును, మనస్సును ఆత్మయందున్ను వ్యాపకపరచి నిండించి అట్టి దృక్ స్వరూపమును పరిపూర్ణమందు బయలుచేయుట అనుపమాన సర్వాతీతము.

శి : బయలు చేయుట యెట్లు ?

గు : ఆ దృక్కుకు మూలము లేదని విచారించడమే బయలు చేయడము. పరిపూర్ణయోగముచేత అంతర్బహిస్సుల తన్ను బయలుచేసి యుండవలె.

శి : అది ఏలాగు ?

గు : శ్లో ॥ బహిస్స్వరూపం బాహ్యంచ. కృత్వా బాహ్యను బాహ్యకం బాహ్యమభ్యంతరం బాహ్యం తద్బాహ్యం కురుసర్వదా ! అనగా ఎరుకను బైలులో విచారించి చూస్తే యీ యెరుకే బయలై కానవచ్చును. ఇటువంటి బయలు ఏది యున్నదో దానిని బట్టబయలు చేయడమంటే చూపులేదు. దీనికి మూలంలేదు. నామరూపములు లేవు. యీ లేనిది విచారించగా ఏమీలేదని గురుముఖముగా యెరిగి తన్ను సర్వం బయలుచేసి ప్రపంచము కానరాకుండా బయలునుచూస్తూ యెప్పుడు దృగ్దృశ్యములుతో స్తవో అపుడు అనుభవము విడువకుండా అభ్యాసముచేస్తూ వుండవలెను.

శి : అట్టివాడు ఏతీరుగా వుంటాడు ?

గు : "... యద్యత్పశ్యతి చక్షుభ్యాం తత్తదాత్మేతి భావయా యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయా జహ్యయా యద్రసంపీత్వాత త్తదాత్మేతి భావయా మనోవాగ్భ్యాంచ యద్గ్రాహ్యం తత్తదాత్మేతిభావయా దేహ జాత్యాది సంబంధా సర్వాశ్రమ సమన్వితా వేదశాస్త్ర పురాణాని సాదపాంసు రివత్యజా॥

కండ్లు చూచు దృశ్యము, చెవులు విను శబ్దము, జిహ్వ గ్రహించు రసము మనోవాగాది యింద్రియములచే తెలియబడు సర్వమున్ను ఆత్మగానే భావించుచూ, జాతి ఆశ్రమాది దేహ సంబంధములగు విషయములను వేద శాస్త్ర పురాణాది విషయములను ఏమాత్రమభిమానించక వానియందు రోతకల్గి యుండవలెను.

శి : కృష్ణ సాందీపు బసవేశ్వరాదుల యొక్క మార్గమిదియేనా ? దీనిని గురించి శివరామదీక్షితులవా రేమన్నారు ?

గు : వారు అతీతభావులని మెచ్చుకొన్నారు. శ్రీకృష్ణుడీ భావమునే ఉత్తర గీతయందు రెండు శ్లోకములలో యుద్ఘాటించియున్నారు.

శ్లో ॥ ఖం మధ్యేకురుచాత్మాన, మాత్మ మధ్యేచ ఖంకురు
ఆత్మానం ఖంమయంకృత్వా నకించిదపి చింతయేత్॥

శ్లో ॥ ఆకాశం మానసంకృత్వా, మనః కృత్వానిరామయం!
నిశ్చలత్వం విజానీయాత్ సముక్తోనాత్రసంశయః ॥

శి : శ్రీ శివరామదీక్షితులవారేర్పరచిన రాజమార్గము, అద్వితీయ పరిపూర్ణ స్థితియా ? దాని నిర్ణయమేమి ?

గు : 1) శ్లో ॥ నిర్దేహం సర్వదా నిత్యం, దేహంపై సర్వదా
సహితన్నిశ్చయం చాద్వితీయ పరిపూర్ణమితీరతం,
2) "అశరీరం సర్వదా అస్తి, శరీర రహితం సదా ।
అయమేవ సద్యోముక్తి రన్యథాభ్రమ కారణం.

శి : దక్షిణామూర్తివారు శెలవిచ్చిన మార్గము నిరంజన తూష్ణీ భూతావస్థయా ? అది యెట్లో శెలవీయండి ?

గు : శ్లో ॥ జన్మనాశద్వయం నాస్తి, యదహంనాస్తి నిశ్చయం తత్తూష్ణీభూత విజ్ఞాన రహిత మిత్యభిధీయతే
అనగా జనన మరణములు లేనేలేవు. నేను అసలే లేను అవి తటస్థ లక్షణంగా వుండిపోవుటయే యీ మార్గము.

శి : యిది మరీ అతీత మార్గమువలె నున్నదే ! యీ నిర్ణయమేదో సరిగా శెలవీయండి స్వామి!

గు : "పరిపూర్ణము వున్నదనీ, యెరుక లేదనీ అనకూడదు. తాను పుట్టనేలేదు. పరిపూర్ణమున్నదని ఎవరికెరుక ?" అంటుంది యీ మార్గము.
శ్లో ॥ జన్మం నాస్తిమృతంనాస్తి శూన్య పూర్ణద్వయం నహి॥
అస్తి నాస్తీతియద్ జ్ఞానం, తత్ జ్ఞానం నాస్తి సర్వదా॥
తానే లేని స్థితియందు ఏ నిర్ణయమున్ను లేదు.

శి : యిట్టి వాని స్థితి ఏమి ?

గు : "వాచారంభణం వికారోనామదేయం" కనుక ఏ మాటా పనికిరాదు.

శి : ఈ మార్గమును గురించి దీక్షితులవారేమన్నారు ?

గు : ఇది మరీ అతీత మార్గం, మహాసూక్ష్మప్రజ్ఞ గలవారికి తప్ప యితరులకు చెప్పరాదన్నారు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదరూపము

## పరిపూర్ణ దృఢప్రకరణం

శి : 'ముక్తి' అనేది వాస్తవమా ?

గు : వాస్తవమే, ఐతే, తాను లేకపోవడమే ముక్తిసుమా !

శి : మరి జీవన్ముక్తి, విదేహముక్తి అని అంటారే అముక్తుల మాట యేమి ?

గు : తానేలేడు. కనుక తనకు దేహమేలేదు, కనుక విదేహ ముక్తి లేదు.

శి : జీవన్ముక్తి కూడా లేనేలేదా ?

గు : జీవుడు లేనివాడు (ఆభాసమాత్రుడు) బ్రహ్మము క్రొత్తగా కాబోడు కనుక జీవన్ముక్తిన్ని లేదు.

శి : ఐతే బంధముక్తుల మాటఏమి ?

గు : తానేలేడు. తనకు మూలం లేదు. కనుక బంధములేదు, బంధము లేదు కనుక ముక్తి ప్రసక్తే లేదు.

శి : తాను లేకపోవడమే ముక్తి అని అంటున్నారే ! ఒకప్పుడువుండెనా ? వుంటే బంధమున్నట్లే.అపుడు ముక్తిన్ని యున్నదే అగునుకాదా !

గు : తానేప్పుడూ లేడు, బంధముక్తులు కేవలం ఔపచారికములేగాని వాస్తవంగాదు.

శ్లో॥ నాహందేహో జన్మమృత్యుర్కు తోమే,
నాహంప్రాణోక్షుత్పిపాసాకుతోమే
నాహంచేతో శోకమోహేకుతో మే
నాహంకర్తా బంధము క్తిర్కుతోమే ॥

అనగా, నేను దేహముగాను కనుక దేహధర్మములైన జనన మరణము లెక్కడున్నవి ? నేను ప్రాణమును గాను కనుక ప్రాణధర్మములైన అకలిదప్పు లెక్కడున్నవి ? నేను మనస్సుగాను గనుక నాకు శోకమోహములెక్కడివి ? నేను కర్తనేగాను కనుక నాకు బంధమోక్షము లెక్కడివి ? అని వేదాంతము చెప్పుచున్నది.

శి : వేదాంతమని, వార్తికమని, నిశ్శబ్దపరమనిష్ఠయని అంటారు వాని నెరిగింపుడు ?

గు : వేదాంతము వాచ్యార్థము. వార్తికము లక్ష్యార్థము. ఈ లక్ష్యవాచ్యాతీతమైనదే పరమనిష్ఠ.

శి : ఈ లక్ష్యవాచ్యాతీత భావజ్ఞులేమంటారు ?

గు : బాహ్యమభ్యంతరం నాస్తి । నాస్తి చిన్మత్రవిగ్రహం నంగా సంగద్వయం నాస్తి । హంకారోనాస్తి సర్వదా ॥

శి : వీరి ప్రత్యేకత ఏమి ?

గు : కర్తననేభావంపోతే చాలంటారు వేదాంతులు. అట్టి కర్తృత్వమునకు కారణమైన అహంకారము పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎప్పుడూ లేనేలేదు అని దాన్ని రద్దుపరచుకోమంటారు పరిపూర్ణులు.

శి : ఎరుక పరిపూర్ణములను దృష్టాంతరీత్యా తెలుపండి స్వామి.

గు : ఎరుకవంటి వస్తువు రెండోదిలేదు. పరిపూర్ణమువంటిదీ రెండోదిలేదు. సాటిలేనివానికి దృష్టాంతము లెట్లు వచ్చును ?

శి : ఐతే ఎరుక ఒకటి, పరిపూర్ణమనేదొకటి, రెండూ వున్నట్టు మీరు అంగీకరిస్తారా ?

గు : అంగీకరించము. సముద్రములో వారధివున్నట్లు ప్రతీతి మాత్రము ఎట్లువున్నదో, అట్లే యీలేని యెరుక వున్నదనే భావము. అసలు లేనేలేదు.

శి : యీ పరిపూర్ణము యెట్టిది ?

గు : చాల విలక్షణమైనది. ఈ మార్గము సద్గురు కృపా పాత్రులకు తప్ప అన్యులకు తెలియదు.

శి : చెప్పగావింటే ఎందుకు తెలియదు ?

గు : చీమకు దివ్యజ్ఞానము, కోడికి కాలజ్ఞానము, కుక్కకు బ్రహ్మజ్ఞానము కల్గివున్నవని తెలియుటకు వాని గర్భమున జన్మించిననే తెలియునట్లుగా పరిపూర్ణభావజ్ఞుల నిలకడ, వారి వర్తనలు ఆ మార్గస్తులకే తెలియును, గ్రంథములచేతగాని, అనుకోగావిన్న మాటలచేతగాని తెలియబడవు.

శి : అవన్నియు యెట్లు తెలియనగును ?

గు : గురుకృపకు పాత్రుడై, రాగద్వేషాదులు వదలి చిరకాలం గురు శుశ్రూషచేస్తేనే అబ్బును. లేకుంటే వాంగ్మాత్రమైపోవును.

శి : కొందరు గురుబోధ కూడదు. విన్నా, అన్నా, ఇది పోక అది గాక మునిగిపోవునంటారు. నిజమేనా ?

గు : మేమధికులము అనే అహంకారాభిమానములు గల వార్కి చెప్పినా ప్రయోజనంలేదు. అట్టివారు బోధ వినకుండా వుంటేనే మంచిది.

శి : మరి ఎవరికి బోధ చెప్పవలెను ?

గు : అధికునికన్న అల్పుడే వుత్తముడు అహంకారం వుండదు గురుభక్తితప్పదు. గురువుకంటె ఎక్కువగాదని లోభము లేక నిర్భయుడై నవానికే చెప్పవలెను. మోహముచేత మునిగిపోయే వారికి యెంతమట్టుకైనా చెప్పగూడదు.

శి : ఏమీలేదు; ఏమీలేదు, అంతా బయలే అంతా బయలే అని కొంతమంది ఘట్టిగా ఘోషచేస్తుంటారే !

గు : లోనలొటారము, బయట బఠారము, మసిపూస్తే నేరేడుపండు ఏలాగుకాదో అలాగే అట్టివారినందరినీ నమ్మరాదు.

శి : ఈబోధ తెలియుటకు ఏ విధంగా గురుని సేవించవలెను ?

గు : గురుముఖముగా తన్మంత్రానుష్ఠాన తన్మార్గములు తెలిసి కొన్నవారి నాశ్రయించి వారిసేవజేసి వారియందు అభేదబుద్ధిచేత అభిమానము లేకుండా ఏలాగున అజ్ఞాపిస్తే అలాగున ప్రవర్తించచూవున్న గురుపుత్రునికే యీ రాజబాట తెలియగలదు.

శి : రాజబాట తెలుసుకొంటే ఏమి జరుగును ?

గు : ఏ భ్రమావుండదు. సూర్యాస్తమయమైన వెనుక ఎండమావుల భ్రమలేనట్టుగానే ఎరుక అస్తమించును గనుక అన్నీ దానితోనే పోవును. తజ్జన్యమైన జీవేశ్వరాది భ్రమలన్నీ పోవును.

శి : ఈ పరిపూర్ణ బోధయొక్క మహాత్మ్యమేమి ?

గు : ఈ బోధవింటే వృశ్చికప్రసూతివత్తు (ప్రసూతికాగానే వృశ్చికం మరణించును)గా తాను ఏలాగున పిల్లలను చూడదో, అలాగే గురుసూచనద్వారా, వుల్లాసముగా వుండగానే యెరుక మునిగిపోవును. ఈ నిర్భయమార్గము వింటే అపుడే, నిర్బీజమౌను. ఏ భ్రమలూ వుండవు.

శి : వుపాధిద్వయరహితం కానక్కరలేదా ?

గు : ఏమీలేదు, గురుశిష్యులు యిద్దరూ లేరు. ఉపాధిద్వయ రహితమేమీ అక్కరలేదు. వాడు లేడు గనుక దేనినీ పొందడు. పట్టముట్టరానిబట్ట బయలే స్వతస్సిద్ధమై వుండును.

శి : అట్టి పరిపూర్ణమును యెట్లు ధ్యానించవలెను ? అదృశ్యవస్తువునందు భావము నిలువదు. దృశ్యమైతే నశించును. రెంటినీ తెలిసిన పిమ్మట యెట్లు ధ్యానించాలి స్వామీ !

గు : పరిపూర్ణబోధయందు ధ్యానాదిసాధనలు లేవు. వినుటకు చెప్పుటకు ఏమీలేదు. భావాభావములు రెండూ ఎప్పుడూలేవు. గురుశిష్యులును లేరు. వారు లేరనే భావంకూడా వుండుటకు తావులేదు.

శి : మరి యిక యెట్లు ?

గు : ఈ మార్గం తెలిస్తే అన్యమేమీ అక్కరలేదు. వల వేస్తే నాచుతోసహా అన్నీ ఏలాగున వచ్చునో అలాగే సర్వము తీసిపారవేసును. తాను వెలుపలా, లోపలా పైనా లేకపోయినట్టు అవును. యీ యెరిగినదానికి మూలమేమిలేదు. కనుక ఎరుగనిదీ ఎరిగినదీ, రెంటినీ తెలిసి యిక ఎరుగక వూరుకొంటే ఏమీలేదు.

# పరిపూర్ణబోధ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదరూపము

## నిర్భావ దృఢప్రకరణం

గు : పరిపూర్ణ పరబ్రహ్మము కేవలం నిర్భావమైనది.

శి : నిర్భావమనగా, భావమా అభావమా, ఉభయాత్మకమా ?

గు : ఏదీకాదు.

శి : ఎందుచేత ?

గు : భావాభావము (భావము యొక్క అభావం అనగాభావము లేకపోవడం) అభావము. అభావాభావము (అభావముయొక్క అభావం అనగా అభావం లేకపోవడం) భావము. కనుక రెండూ అభావరూపములే.

శి : ఇంకా వివరించండి స్వామీ !

గు : అభావము ఎప్పుడు లేదో భావమున్నూ చెప్పకూడదు.

శి : ఎందుచేత ?

గు : ఘటాభావమునకు ఘటము విరోధము.

శి : అర్థం కాలేదు స్వామీ !

గు : ఘటమున్నదనే భావము, ఘటము లేదనే భావమునకు విరుద్ధము లేక వ్యతిరేకముగదా! కనుక యీ భావములు రెండూ సాపేక్షికములు. (అనగా ఒక శబ్దముపై రెండవ శబ్దము ఆధారపడి యున్నది. అందొకటి లేకపోతే రెండవది లేదన్న మాట.)

శి : యీ భావభావ విషయములు దృష్టాంతపూర్వకముగా తెలపీయండి స్వామీ ?

గు : ఐశ్వర్యముంటే దరిద్రములేదు. దరిద్రముంటే ఐశ్వర్యం లేదు, అను వాక్యములు తీసుకొంటే, దరిద్రము లేకుండుటే ఐశ్వర్యం, ఐశ్వర్యము లేకుండుటే దరిద్రం, ఒకదానిభావము రెండవదాని యొక్క అభావము కనుక భావమున్న చోట మరొకదాని అభావం వున్నాయన్న మాట, ఆవిధంగా భావాభావములు రెండూ పరిపూర్ణమునకు చెప్పరాదు.

శి : ఉభయాత్మికము అంటేనో !

గు : భావాభావములు రెండూ ఏకకాలమున ఏకస్థానమందుండుట విరుద్ధం కనుక అసలే చెప్పరాదు.

శి : ఇవన్నీ దేనికి చెప్పనగును ?

గు : ఎరుకకు; ఎరుక భావపదార్థమూ, ఉబయాత్మికమూ కూడానగుచున్నది

శి : ఉభయాత్మికము విరుద్ధమంటిరే !

గు : ఎరుకయందు ఏదీ విరుద్ధంకాదు. ఎరుకయే మహా విరుద్ధం.

శి : ఎరుక ఉభయాత్మికముగా ఎట్లున్నది ?

గు : వెలుగునీడలు రెండూ ఒకే కాలమున తోచుచున్నవి. మిట్ట మధ్యాహ్నమున ఒకేస్థానమందుగూడ కానగును.

శి : ఇది ద్రాష్టాంతికమందు ఎట్లు చూడాలి ?

గు : ఎరుక మరుపులుగాచూడు. యీ రెంటిలో ఒకదాని భావము మరొకదాని అభావమైయున్నది.

శి : ఈ ఎరుక మరుపులు రెండూ లేనిచో ?

గు : అపుడు పరిపూర్ణ బ్రహ్మమే స్వతస్సిద్ధము.

శి : ఎరుక జగములు రెంటి అభావమునందు పరిపూర్ణ పరబ్రహ్మము నిశ్చయమంటున్నారు. అభావమునందు భావము ఇమిడిందంటున్నారుకదా ! అపుడు పరిపూర్ణ పరబ్రహ్మమును భావపదార్థమని ఏల చెప్పరాదు ? అట్లే పరిపూర్ణ పరబ్రహ్మమున్నది. అంటే దానియందు మిగతావన్ని అభావమని ఏల చెప్పరాదు ? అప్పుడు పరిపూర్ణము కూడా సాపేక్షికజగత్తులోనిదే కాగలదు.

గు : నిజమే, కనుకనే పరిపూర్ణమున్నదనీ చెప్పరాదు. ఎరుక జగములు లేవనీ చెప్పరాదు. అస్తినాస్తులు కానిదది, మరిన్నీ ఎరుకమరుపులు లేకపోవుటయనేది ఎన్నడైన కలుగుచున్నదా?

శి : మరి పొయ్యేది ఏమి ?

గు : రాకడ వుంటేకదా పోకడవుండేది ? వానియందలి భ్రాంతి మాత్రమే. కనుకనే "భ్రాంతిరహితం మిదం మోక్షం" అన్నారు.

శి : అయితే యెరుకకుకూడా రాకడపోకడాలేదని చెప్పినట్టు అవుతోందే !

గు : పుట్టని ఎరుకకు రాకడేమి ? పోకడఏమి ? సూర్యుడేలేకుంటే వెలుగు నీడలుండవు. ఎరుక లేకుంటే ఎరుక జగములు రెండూ లేవు. కనుక నిర్భయము. ఎండమావులలో ఎవడైన మునిగివచ్చునా ? లేని వంధ్యాసూనుని దూషణవలన ఎవరికైన అభిమానం కలుగునా ?

శి : అబ్బా ! బోధ ఎంత నిగూఢంగానున్నది ? సర్వభ్రాంతి రహితం.

గు : సత్శిష్యునికంతే, కాని మొదట మహా వినయవిధేయతలు ప్రదర్శించి ఆ వెనుక యెందుకూ పనికిరాక భక్తిహీనులయ్యే శిష్యులైతే ఏమీ ప్రయోజనంలేదు. భ్రాంతి

రహితస్థితి గలుగదు. అటువంటి శిష్యులెంతమందున్నా నిష్ప్రయోజనమే. వృక్షములయందెన్ని ఆకులు మొలవవు ? ఎన్ని రాలవు ? అలాగే నిరర్థకము.

శి : ఈబోధ యెట్టి వారికి చెప్పకూడదో శెలవియ్యండి.

గు : 1) భ్రాంతి అనుమానము వదలనివానికి 2) గురువాక్యము ప్రకటనచేసేవానికి 3) చలచిత్తునికి 4) శాస్త్రవాసన బలీయమై యున్నవానికి 5) మతాభిమానము కలవానికి 6) గురువునెడ భయభక్తులు లేనివానికి 7) దొంగభక్తి చూపేవారికి 8) మర్మముగలవానికి, చెప్పకూడదు.

శి : మతాభిమానముంటే మంచిదేకాదా ! తీవ్రముగా కృషిచేస్తాడుగదా !

గు : కాదు. అది పశువు మెడలో కట్టిన గుదికర్రవలె బంధ కారణమగును. మతసిద్ధాంతాలు కాలపాశములవలె కట్టివేయును. నిష్పక్షపాతముగ యోచించనీయవు.

శి : అద్వైతమతము గురించి మీ అభిప్రాయమేమి ?

గు : అద్వైతము అడవిత్రోవవంటిది.

శి : కారణము ?

గు : అది భక్తిహీనము, కర్మహీనము.

శి : ఐతేనేమి ?

గు : అవివేక, అంతఃకరణశుద్ధి ఏకాగ్రత మొదలగునవి ఎట్లు చేకూరును ?

శి : పరిపూర్ణభావమా ?

గు : అది మతము కానేకాదు. అతీత సిద్ధాంతము, దానిని పరిపూర్ణమనీ అనరాదు. అది భావాభావరహితం, నిర్భావం, గురుభక్తి త్రికరణశుద్ధి రూపప్రవర్తన, ఆత్మవస్తుసంధానము యిత్యాదులన్నీ వున్నవానికే సద్గురువు పరిపూర్ణబోధ తెలియజేస్తాడు.

శి : "ఏమి చేసినా ఏమీలేదు : నేను అసంగుణ్ని ; నిర్వికారుణ్ని; మనస్సు చేస్తుంది ! నేను చలించను; చస్తూపుడుతూ వుండేది మనస్సు; నాకు ఏమీలేదు; నేనే బ్రహ్మను" అని అంటారు కొందరు.

గు : తిన్న కుక్క తినిపోతే, వున్న కుక్కను కట్టివేసి కొట్టారన్న సామ్యముగావుంది. అన్ని భ్రాంతులకు మూలమైన నేను సత్యము దేహాదులు మిథ్యఅంటే ఏలాగు ? మనస్సు అన్నియింద్రియములవంటి పనిముట్లు మాత్రమే ఆమనిషిని నేను చంపలేదు; నాకత్తి నరికినది; నేను దోషినికానని, హంతకుడు వాదించినట్లుగా వుంది.

శి : యితర మతవాదుల సిద్ధాంతములేమి ?

గు : జీవబ్రహ్మవాదులైన అద్వైతులేపోగా ద్వైత, విశిష్టుల తలపెట్టనక్కరలేదు. గడ్డపారలు గాలికిపోగా పుల్లెలు మాట ఏమన్న చందంగా వున్నది. ఏమీలేదంటే ఒకటి (అద్వైతము)

మంచిదా ? రెండు (ద్వైతము) మంచిదా ? మూడు (విశిష్టాద్వైతము) మంచిదా ? అనడమూ అటువంటిదే.

శి : పోనీయండి. భావము, అభావము, భావాభావము ఏమీలేవని యంటిరి. ఇక పరిపూర్ణమును ఏమనవలెను.

గు : ఏమనీ అనరానిదానిని ఏమన్నా పనికిరాదు. దానియందేమీ లేదని తెలిసి ఆ తెలివి మానడమే పని నిర్భావమనియన్నా మరొక పేరు పెట్టినా వ్యవహారార్థమే,

శి : మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమీలేదని అనుకొంటూ వుండవలెనా ?

గు : అనుకొంటూవుంటే మరీ గట్టిగా వుంటుందిగానీ పోదు, అది అయితే యిదికాదు, ఇది తెలిస్తే, అదిలేదు. అనడమేలేదు, ఇదే స్వతస్సిద్ధము ఏప్పుడును లేని తనకుముప్పేలేదు. ఏమిన్ని ఎంతమాత్రం బట్టయబలులో పుట్టనేలేదు.

శి : జీవబ్రహ్మల మాటేమి ? వారెక్కడకు పోతారు ?

గు : లేనేలేరు కనుక పోనేపోరు. మొదలు మోసమంటే లాభానికి గుద్దులాటయా ?

శి : మొదలు ఏమిటి ? లాభమేమిటి ?

గు : పెట్టుబడి నష్టమయిపోయిందంటూంటే లాభాలమాట వేరే చెప్పాలా ? అన్నిటికి మూలమయిన ఎరుక లేదని తెలిసి మౌనం వహించటమే జన్మఫలము, మొదట దానిని మోసం చేయ్యడమే లాభం. పోకడా గుద్దులాట యికలేదు. ఈ లాభం వుంటే ఏలాభంలేదు. యిదే భయరాహిత్యం, ఈ నిశ్చయమే నిర్భయము.

శి : నిర్భయము ఎక్కడ వున్నది ? ఏలావున్నది ?

గు : వద్దనే వున్నది. గుద్దుకొన్నా తెలియదన్నట్లుగా వున్నది. పట్టముట్టరాక, బట్టబయలై, అహోరాత్రస్య, పక్కతీరుగా, యెడతెంపులేక, సర్వకాలములయందు సమస్తద్రవ్యము లయందు, నిండి పూర్ణాత్పూర్ణమైనది.

శి : భ్రాంతికారకమైన ఎరుక ఎక్కడ వున్నది ?

గు : లేనే లేదంటే ఎక్కడున్నదంటావేం ? వెంటరావద్దంటే యెత్తుకోమని మొత్తుకున్నట్టు, దానికదే మూలం, దానికదే స్థానం.

శి : యీ మార్గాన్ని గురించి యింకా చెప్పండిస్వామి !

గు : ఏం చెప్పను ? ఆత్మానాత్మరహితం. ప్రత్యగాత్మా పరమాత్మ రహితం. ద్వయదోషరహితం, అవాంగ్మానసగోచరమైనదానిని గురించి ఏమి చెప్పను ? ఎరుక లేక తెలిస్తే ఏమీలేదు ఉన్నదే వుండును. చెప్పడానికి ఏమీలేదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురు-శిష్య సంవాదరూపము

## ఎరుక రాహిత్య నిర్ణయ ప్రకరణము

గు : శ్లో ॥ అహంతా, పరహంతా, పూర్ణహంతా
నిరహంతా, యితి చతుర్విధాః వర్తతే ॥
జ్ఞానులయందు అహంకారము యీ నాలుగు విధములుగా వుండును.

శి : ఈ నాలుగు రకములు దయచేసి వివరించండి స్వామీ !

గు : 'అహంత' యనగా ఈశ్వరుడే సర్వకర్తయని ఫలాపేక్ష రహితముగ ఈశ్వరార్పణంగ కర్మచేయువాడు 'అహంతా' అనబడును (2) పరహంతా యనగా తానే సర్వసాక్షినని ధృడము కలిగియుండుట. (3) పరిపూర్ణహంత అనగా సర్వము బ్రహ్మస్వరూపమే, యితరమేమీ లేనేలేదు. అను భావము కలిగియుండుట (4) నిరహంత యనగా తానే లేననెడి దృఢము కల్గి యుండుట.

శి : తాను లేను అనుకొంటే ఏమి ఫలము ?

గు : "తాను లేను" అనుకొంటే యేయపేక్షాలేదు. బంధవ్యాక్షాపేక్షాలేదు, కర్తృత్వమూలేదు.

శి : ఎప్పటికి అట్లా అనుకొంటూవుండటం కష్టంకదా ? తాను ఉన్నానని కర్మచేస్తే మాత్రమేమి?

గు : కళాయి పోయిన తామ్రపాత్రలో పోసిన చింతపండు రసమువలె, అట్టివాడు ఎందుకు కొరగానివాడు అగును.

శి : ఎరుక మొదటినుంచి చివరవరకు ఏకరూపముగా వుండుట అసంభవముకదా !

గు : అవును. మొదలు వుంటే కొనకులేదు. కొనకువుంటే మొదలులేదు. ఎరుక ఒకచోటవుంటే మరొకచోట లేదు.

శి : దొంగత్రోవ తెలిపే గురువుకాకుండా, వున్నది వున్నట్లుగా యెవరు తెలియజేస్తారో, వారే సద్గురువులు, ఆనాడే లింగదేహము భంగమగును ?

గు : లింగదేహమేమిటి ? లింగమేలేదు ? లింగదేహమునకు సంగమేలేదు. లింగమూ సంగమూ లేనప్పుడు భంగం లేదు.నిస్సంగము, నిర్లింగము, నిర్బీజము అయినదేదో అదే వుండును.

శి : ఈ సిద్ధి కలిగివుండుటకు ఏమంత్రము స్మరించవలెను ?

గు : "అయం, వ్యర్థ, బాహ్య, కోపీన భవతి" ఈ మంత్రం స్మరిస్తే తాను ఎప్పుడూ లేడు. నిర్భయము.

శి : ఈ మంత్రము యొక్క ప్రభావమేమి ?

గు : యిది తననే లేకుండా జేసే మంత్రము. ఈ మంత్రము జపించుచూ వుండగానే, అచలము స్వతస్సిద్ధమగును ఎప్పటికీ ఒక్కతీరే.

శి : స్మరించేదేమగును ?

గు : అటువంటిది స్మరిస్తే యిటువంటిది (ఈ స్మరించేటటువంటిది) అప్పుడేలేదు. ఎప్పటికీ మూలంలేదు. కనుక మూలంలేని మంత్రమునే స్మరించవలెను.

శి : మూలంలేదు అనగానేమి ? మూలంలేకపోతే దాని వలన లాభమేమి ? మాయపోవునా? లేక మిగిలి వుండునా ?

గు : మూలంలేదనగా, ఏమీలేదనటమే మాయమునుపే లేదుగనుక ఏమీలేదు. గట్టిబోధ దొరికితే భయముండదు.

శి : తెలివి, మాయా రెండూ లేకపోతే వుండేది ఏది శుద్ధ శూన్యమా ? ఏమని చెప్పవలెను?

గు : శూన్యమనడానికి, పూర్ణమనడానికి, అనేది ఏమీలేదు. వినుటకు ఏమీలేదు. అన్నా ఏమీలేదు. అన్నీ తనయందు శుద్ధశూన్యము అయివున్నదేదో అదే వుంది.

గు : ఎరుక లేకుంటే ఏమీలేదు.

శి : అది ఎట్లు ? నిద్రలో ఎరుక ఏమీలేకున్నా మేలుకొంటే మళ్ళీ అన్నీ వున్నాయిగదా !

గు : నిద్రలో ఎరుక మరువు రూపంగా వుందేగాని ఏమి లేకుండా పోలేదు. కనుకనే జాగ్రతలో మళ్ళీ ఎరుక రూపంసిద్ధం. పరిపూర్ణబ్రహ్మమందు ఏదీ ఏరూపంలోనూ, తుదకు బీజరూపంగా కూడా ఏమీలేదు.

శి : యిందుకు దృష్టాంతరమైనా తెలవిప్పించండి స్వామీ ?

గు : దృష్టాంతరములకేమి ? త్రాడే లేకుంటే సర్పభ్రమలేనట్లు; శుక్తిలేకుంటే రజితభ్రమలేనట్లు; బింబమే లేకుంటే ప్రతిబింబము లేనట్లు; ఎరుక లేకుంటే ఏమీలేదు.

శి : ఐతే ఎరుకకు ఉపాధి ఏది ?

గు : ఎరుక కెరుకే యుపాధిగానున్నది అన్ని భ్రమలకు మూలం ఎరుకే.

శి : యిది పట్టుగానున్నది. అది ఎట్లో దయచేసి చెప్పండి స్వామీ.

గు : ఎరుకయందలి భేదములే యెరుకకు భ్రమకారణములగుచున్నవి. స్వగత భేదమును చూచుకొని (తన్ను చూచుకొని) తానే భ్రమించుచున్నది.

శి : దృష్టాంతం చూపించండి నాకేమీ అర్థం కావటంలేదు.

గు : స్ఫటిక స్తంభమునకునకు కట్టివేసిన కుక్కవతుగా, గిరా గిరా దాని చుట్టూ ఎన్ని తడవలు తిరిగినా ఆ స్తంభమందలి తన ప్రతిబింబమునేచూచి తాను మొరుగుచూ అవి మొరుగుచూ వున్నట్లు బింబాలు చూచుకొంటూ తన మెరుగుడే తాను వింటూ అవన్నీ వచ్చితన్ను చంపునని భ్రాంతిలో అలమటించిపోవును.

శి : ఈ భ్రాంతినివారణ ఎట్లుకాగలదు తండ్రి!

గు : సున్నపురాళ్ళమీద నీళ్ళుజల్లితే విరిగినట్లు గురుకృపా జలముపోసితే భ్రాంతులెల్ల విరిగిపోవును, యెరుక ఎప్పుడు తోచినా వెంటనే ఎరుకలేదను విషయము స్మరిస్తూ వుండవలెను.

శి : ఇంకేమీ అక్కరలేదా ?

గు : గురుకృపకై అనుష్ఠానమూ, ఎరుకలేనే లేదనుభావమూ వుంటే చాలు. పనికిమాలినవానితో ఏమిపని ? అవి అన్నీ అపభ్రంశము పొందించును రాజమార్గం తెలియకుంటే రాపిడిమానదు రాకడపోకడలలో నేవుంటాడు ఎన్ని చదివినా ఏమీ సార్థకం లేదు. చదువు మర్మం తెలిస్తే చచ్చినట్లు పడివుంటాడు.

శి : మీరిట్లాఅంటారు ? ఎరుకే ఆనందమయమని అందరూ అంటారు.

గు : ఎరుక సత్యమంటే అందరికీ సమ్మతమే. ఎరుక దుఃఖమయమైనా సుఖముగానే వుండును. అది దుఃఖముగానే పరిణమించును.

శి : సుఖరూపంగా నున్నది, దుఃఖరూపంగా యెట్లు పరిణమించును ?

గు : "రాజ్యాంతే నరకం ధృవం" అన్నారు. అంతేకాకుండా రాజ్యపరిపాలనా కాలమందు సహితమూ ఎంతదుఃఖం అనుభవిస్తుంటాడు ? శత్రుభయమూ, మృత్యుభయమూ జీవింతమంతా మహా భయాస్పదమైన రాజ్యంకోసమే ప్రయత్నిస్తాడు. పుణ్యస్త్రీ సంపర్కము, పరస్త్రీ సంపర్కము, ధన మాన ప్రాణాదులకు హాని కలిగిస్తుందని యెరిగికూడా భ్రమచేత దానికై ప్రాకులాడినట్లుగానే ఎరుకయే ఆనందకరంగా తోచును.

శి : పరమానంద ప్రాప్తియే మోక్షమన్నారుగదా !

గు : "తన్మోక్షం పరం సుఖం నిర్వాణంచ మహాత్సుఖం" అన్నారు. అంటే తత్ అనగా మోక్షము. ఆ మోక్షంనుండి మోక్షంచెందడమే పరమసుఖం, నిర్వాణము, అనగా చైతన్య నాశనమే, మహాత్సుఖం అన్నారు. తానులేకపోవడంకంటే అతిశయం లేదు. ఇంతకంటె మిక్కిలిలేదు.

శి : ఇట్టి గొప్పబోధను మెచ్చుకొనకుండా కొంతమంది కాదంటూ వాదిస్తారే !

గు : సూదులచేత గ్రుచ్చితేపర్వతమునకు నొప్పి పెట్టునా ? ఇటువంటి గురుబోధ దొరుకవలెనేగాని ఎంతమంది కాధంటే ఏమిభయము ? సవితికంచమని అందు పురీషం పెట్టుకొని తింటే దానినోరే చెడును. పరిపూర్ణుని కేబాధాలేదు. లేనిది లేనేలేదు కనుక లేని ఎరుకకున్ను బాధాలేదు.

——— 0 ———

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురుశిష్యసంవాదము

## పరమనిర్వాణఫలప్రకరణము

గు : యెరుక చేత సమస్తము యెరిగి యెరుక విడిస్తేసరి.

శి : అది ఎట్లాగో, కొంచెం వివరించండి స్వామి !

గు : దీపంచేబూని చీకటిలోవున్న వస్తువును తీసుకొని ఆ పిదప దీపమును పరిత్యజించిన విధముగా యెరుకతో తనను తనకన్యమైన పరిపూర్ణమును తెలుసుకొని కొనకు ఈ యెరుకను నిరర్ధకమైన దానిగా విడచివేయవలెను. అప్పుడు తానే లేకపోవును.

శి : తానెట్లు లేకపోవును ?

గు : అంతా తానైన పిదప అట్టితాను పరిపూర్ణ పరబ్రహ్మమునందు గురువాక్యముచే లేనట్లు తెలిసికొని లేకుండానేపోవును. నమాజు చేయకపోతే మశీదు విరిగి మీదపడి చచ్చినట్లుగా, పరిపూర్ణము తెలుసుకొనగోరి, తానే లేకుండా పోవుచున్నాడు. ఏ బోధ అయినా ఈ బోధతో సరికాదు.

శి : ఎందుచేత ?

గు : వీరి ఆశయములు ఆదర్శములు వేరుగానున్నవి.

శి : అది యెట్లాగో సెలవుయివ్వండి స్వామీ !

గు : పరిపూర్ణుల నిర్ణయమందు సగుణ నిర్గుణ రహితమే సాధువృత్తి, క్షేత్రక్షేత్రజ్ఞ రహితమే జపము. ద్వయదోషరహితమే గురుకృపాఫలితము, సువర్ణముతో అరకూటము (ఇత్తడి) రజితముతో తగరము, సమానము కానట్టు, ఈ బోధతో ఏబోధలు సమానములుకావు. ఎన్ని మర్మములు తెలిసినా యిది తెలయకుంటే మానవజన్మయే వ్యర్థము.

శి : ఎందుచేత ?

గు : మానవజన్మ ఎందుకు ? అంటే తిరిగి జన్మలేకుండా చేసుకొనుటకే పూర్ణబోధచేతనే యిది సాధ్యము.

శి : పరిపూర్ణ బోధజ్ఞులవలె యిక సాధకులును ఆచరించి జన్మరాహిత్యము చేసుకొనకూడదా?

గు : వారినిచూచి వీరు నేర్చుకొనబోతే పులినిచూచి నక్క వాతలు పెట్టుకుంటే పురుగులుపడి చచ్చినట్టు కాగలదు.

శి : ఎందుచేత ?

గు : పరిపూర్ణ భావజ్ఞులు చేసిన కర్మకలాపముల యందు సంస్కారము అంటదు. యితరులకు ఆయుక్తి తెలియదు. కనుక బలీయముగ కర్మసంస్కారములు అంటగలవు. నేతిజిడ్డు నాలికమీదనైతే అంటదు కాని మూతిమీద అంటితే పిండిపెట్టి కడిగినా పోదు.

శి : యీ బోధయొక్క ప్రత్యేక విశిష్టత యేమి ?

గు : కొండనాలుకకు మందు పెడితే వున్న నాలుక వూడిపడినట్టు భ్రాంతిరహితము చేసుకోవాలంటే భ్రాంతిమూలమైన తానే లేకుండా పోవుచున్నాడు.

శి : తానే లేకుండా పోవుటయంటే ఏమి ?

గు : పరిపూర్ణ బ్రహ్మమునందు తనకు మూలములేదు అని, నిస్పృహచెందియుండుటయే యెరుక లేకపోవుటయగును.

శి : యిది దృఢమైతే మాత్రము కర్మసంస్కారములు ఎందుకు అంటవు ?

గు : మొదలే లేదు. కనుక ఏమిచేసినా ఏమీలేదు. వేషగాడు ఏ వేషము వేసినా ఏమిలేదు. కలలో యొకనిని చంపితే, దాని వలన దృష్టాదృష్ట ఫలములేమియు కలుగవుకదా ! అలాగే లేని యెరుక లేనేలేదు. అని గుర్తించినవానికి, ఏ కర్మఫలములూ అంటవు.

శి : యెరుక లేదు అన్నారుకదా ! మరి వేదశాస్త్రములు మాట ఏమి ?

గు : కోతులపెండ్లికి గాడిదలు గాయకులైనట్లుగా వుండిఎరుకే లేదంటే, ఎరుకచేత చేయబడ్డ వేదశాస్త్రములు సత్యమా ? కల మేలుకొంటే కలలో వచ్చినవన్నియు కలతోపోతవి గాని, కొన్ని మిగులునా ? ఈబోధచేత మేలుకొంటే ఏబాధలేదు, దేహిదేహములు రెండూ లేకుండాపోవును.

శి : రెంటింటికి బేధములేదా ?

గు : లేదు బీజాంకురములవలె, అగ్నిపుష్పములవలె, చంద్ర చంద్రికలవలె ఒకటేగాని వేరుకావు.

శి : ఈ మార్గము తెలియుటకు ముందుగా యేయే విషయములు తెలుసుకొనవలెను ?

గు : సచ్చిదానంద మార్గములు తెలిసి ఆ పిమ్మట యీ మార్గము తెలిసితే చెరుకుగడయందు పండు పండినట్లే బంగారమునకు తావియబ్బినట్లే చిత్తరువునకు జీవము పోసినట్లే.

శి : గురువు యీ మార్గమును శిష్యుని ఏ విధముగా బోధించును ?

గు : సామదాన భేదదండములు అనబడే చతుర్విధోపాయములు చేత శిష్యునికి ఈ బోధ అతికింపచేయును.

శి : ఆ మార్గములు ఎట్టివో కొంచెం వివరించండి స్వామి !

గు : (1) సామ మనగా స్నేహముపైన ఓయీ ! ఈ బోధవిని మహాపవిత్రువు కమ్ము, అని ఆశీర్వచనపూర్వకముగా బోంధించుట సామోపాయము. (2) యెరుక పరిపూర్ణములను బాగుగావిమర్శించి రెంటిభేదమును వివరముగా నాటునట్లున్నూ, యెరుక భ్రాంతి తొలగునట్లున్నూ, బోధించుట భేదము. (3) ఓరీ ఈబోధ నీకిస్తాను ఈబోధ విధానమును దాచుకో ! నిర్భయమౌతుంది. అని బోధించుట దానము. (4) ఈబోధ వినకుంటే సంసారము అనే నరకకూపమునపడి యెప్పటికి పడి వుంటావు. కడతేరలేవు, యిప్పుడే మేలుకో ! అని బోధించుట దండోపాయము.

శి : ఈ నాలుగు మార్గములు ఒక్కని యెడలనే ఉపయోగించవలెనా లేక ఒక్కొక్కనికి ఒక్కొక్క మార్గము చాలునా ?

గు : శిష్యుని అధికారముకొద్దీ చెప్పవలెను. ఈ నాలుగును చెప్పితేనే గాని శిష్యుని చిత్తము స్థిరముకాదు. యెరుక తొలగదు. గురువు కనిపెట్టక చెప్పెనేని, పాముకు పాలుపోసినట్టు వ్యతిరేకమగును. చైతన్యమే బ్రహ్మము, అను భ్రాంతి తొలగదు.

శి : చైతన్యము యెన్ని విధములు ? అందుయే చైతన్యము బ్రహ్మస్వరూపమైయున్నది.

గు . చైతన్యము ఒక్కటేగాని స్థానభేదమునుబట్టి వ్యవహారమునుబట్టి వివిధ నామములు చెందుచున్నది.

1) శుద్ధచైతన్యము : మాయసంబంధము లేనిది.
2) ఈశ్వరచైతన్యము : మాయతోకూడిన చైతన్యము.
3) జీవచైతన్యము : అవిద్యలో కూడిన చైతన్యము.
4) ప్రమాతృచైతన్యము : అంతకరణ సంబంధమైన చైతన్యము.
5) ప్రమాణచైతన్యము : అంతకరణవృత్తి చైతన్యము.
6) ప్రమేయచైతన్యము : తెలియబడే చైతన్యము.
7) కాలము అని చెప్పబడే చైతన్యము :

ఈ ఏడువిధములైన చైతన్యముల రూపముగా వుండే యెరుక చరాచరరూపముగా తోస్తూవున్నా, మొత్తమంతము కలసి పరమాత్మయే.

శి : దీనిక మూలము ఏమైనయున్నదా ?

గు : కర్రను బాడిదచేత చెక్కితే అగ్ని కానవచ్చునా ? అంపముచే కోస్తే కానవచ్చునా ?

పెరుగును తరిస్తే వెన్నకానవచ్చినట్టు, ఆత్మయందుతరిస్తే, దానికి అదేమూలమైనట్టు తెలియవచ్చును.

శి : పరిపూర్ణము ఏపద్ధతిచేనైనా కానవచ్చునా ! కానరాని పరిపూర్ణమును సత్యమనుట యెట్లు ?

గు : తనవీపు తనకు కానరాకుంటే తనకు వీపులేనట్టగునా ? తన ముఖం తనకు కానరాకుంటే ఏలాగున లేనట్టుకాదో, అలాగే కానరానంత మాత్రముచేత పరిపూర్ణమును లేదు అనరాదు. గురుముఖతః తెలిసి, తెలియక తెలిస్తే అంతా బట్టబయలే, విచారించే యెరుకే విరిసిపోవును.

శి : అపిమ్మట ఏమి ?

గు : ఏమి అనడమునకు ఏమీలేదు. అనవచ్చిన్నమైన అచలము తప్ప రెండోది లేదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదరూపము

## పరిపూర్ణబోధోపదేశ దృఢప్రకరణము

గు : ఈ బోధ విడచి ఏమత(భ్రాంతిజెందినా అరచేతిలోని అమృతమును వదలుకొని మోచేయి నాకబోయినయట్లె యగును.

శి : ఉపాధిద్వయరహితమైన బట్టబయలులో యీ లేని యెరుక యెప్పుడూ లేనేలేదని యీ సిద్ధాంతం; కనుక భ్రాంతిరహితమునకీ పూర్ణబోధవంటి గొప్ప బోధలేదు.

శి : కొందరు అధ్యారోపాపవాదయుక్తిచే నిరసనచేస్తున్నారుగదా ! శ్రుతిస్మృతుల ప్రమాణములు కూడా చూపుచున్నారుగదా !

గు : ఆశాపుష్పము; శశశృంగములను మొదట వున్నట్టుగా ఎందు కారోపించవలె ? పిదప ఎందుక్కు లేవని అపవాదము చేయవలె ? తిష్ఠపంక న్యాయముగా అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల ? అలాగే ఎరుక పుట్టనే లేదనరాదా ? అపుడు జీవేశ్వరులు, విద్యావిద్యలు ద్వైతాద్వైతములు సుఖదుఃఖాదులు ఏమీలేనేలేవుఅని దృఢంకాగలదు.

శి : వార్తికకారులుకూడా అధ్యారోపాపవాదన నిరసన చేస్తారుగదా ! వారేమంటారు ?

గు : తనయందు తనకు విశ్వముతోచదు కనుక ఈ జగత్తు పుట్టనేలేదు. అందుచేతాను ఎప్పుడూ పోనేపోదు. అంటారు.

శి : పోనీ వీరు చెప్పినది సత్యమని ఒప్పుకొంటారా మీరు ?

గు : అదిన్ని వెఱ్ఱిమాటయే ?

శి : అది యెట్లో వివరించండి స్వామి.

గు : తనకంటె అన్యము జడస్వరూపముగదా ! ఉన్నదనిన్ని, లేక లేదనిన్ని తనకు తోచకుంటే ఎవర్కి తోచును! గుర్తెరిగే తాను యెపుడునిత్యమో జగత్తున్ను అప్పుడే నిత్యము.

శి : ఐతే సిద్ధాంతవాక్యమేదో శెలవియ్యండి స్వామి !

గు : తనకు రాకపోకడలున్నవి. సర్వభ్రమలు తనకే. అనాత్మ లేదంటే ఆత్మ దానితోనే లేదు.

శి : ఆత్మ సత్యము; అనాత్మ అసత్యమూ కావా ?

గు : రెండూ కలసియే ఒకటి. రెండూ అసత్యమేననాలి. అట్టి అసత్యవస్తువును ఆరోపించి తిరిగి లేదనగూడదు; అది దృఢమయ్యే కొరకు శ్రవణమనన నిధిద్యాసలు చేయుట పనికిరాదు.

శి : ఎందుచేత పనికిరావు ?

గు : తాను లేనివాడైతే దేహ, ఇంద్రియ మనస్సులు లేవు కనుక శ్రవణ మనన నిధిద్యాసలున్నూ సమాధిన్ని చెప్పరాదు.

శి : యితరవాదము లింకేమైన నున్నవా ?

గు : గురూపదేశానంతరము తాను వున్నట్లు తోచబడినా నిజంగా లేనేలేడు. అంటూ, కస్తూరి పెట్టిన భరణివలె, ఇంగువ కట్టిన గుడ్డవలె, దగ్ధపటమువలె అంటూ దృష్టాంతములను చెప్పెదరు.

శి : యీ దృష్టాంతములు సరిపోయినట్లే వున్నాయిగదా !

గు : ఎంతమాత్రమూ సరిపోవు.

శి : ఎందుచేత ? భరణిలో కస్తూరి, గుడ్డలో ఇంగువ, దగ్ధముగాక మునుపు పటము ఒకప్పుడైనా నిజముగా వుండి పిదప లేకపోయినవి. ఎరుక ఎప్పుడూ నిజముగా వుండి యుండలేదు. కనుక ఆ దృష్టాంతములేమి పనికిరావు. మరిన్ని కస్తూరికి భరణివలె, యింగువకు గుడ్డవలె పరిపూర్ణము ఎరుకకు ఆధారముకాదు. స్థానమూకాదు.

శి : బోధ పొందకపూర్వమూ ఎరుక లేదు పొందిన పిమ్మటా ఎరుక లేదు. మరి, అప్పటికీ యిప్పటికీ శిష్యునియందు ఏమైనా మార్పుకలిగినదంటారా లేదంటారా ?

గు : అంతఃకరణ పూర్తిగా మారిపోయింది. అప్పుడే ఎరుకే సత్యమని నిత్యమని భ్రాంతిలో నున్నాడు. యిప్పుడున్నట్లుగా తెలుసుకొని భ్రాంతిరహితుడైనాడు.

శి : ఐతే దగ్ధపట దృష్టాంతమాతని కెందుకు వర్తించదు ?

గు : దగ్ధపటము, అందరికి ఒకే తీరున కనిపిస్తుంది. యెరుక అట్లా కాదు. భ్రాంతిసహితులకు నిత్యంగా భ్రాంతిరహితులకు ఏమిలేనిదిగా తెలియవస్తోంది.

శి : స్వామీ ఐతే పరిపూర్ణబ్రహ్మము ఎరుకను లేకుండా చేసే మహా మహిమాన్వితమై యున్నదన్నమాట.

గు : ఛాఛా అట్లా అనరాదు. ఎరుక నాశము పరిపూర్ణము చేసెననరాదు. ఆ పరిపూర్ణం "నిష్కళం నిష్క్రియం శుద్ధం నిరపద్యం నిరామయం" అని చెప్పబడుతోంది.

శి : మరి యెరుకను ఎరుకే లేకుండా చేసుకొనివచ్చునా ?

గు : "ఎరుకే తిరమంచెరిగించును, శంకించును యెరుకే తుదకేమి లేక యేగునోయన్నా' ' యన్నారు పెద్దలు.

శి : రెండంటూ వుంటే ఒకదానిని మరొకటి నాశనము చేసింది అనవచ్చును ఎరుక ఏకవస్తు వేగదా తన్నుతానే లేకుండా చేసుకొనునా ?

గు : చేసుకొన్నదని చెప్పితే వంధ్యాపుత్రుడు వురివేసుకొని చచ్చిపోయెనన్నట్లుంటుంది.

శి : మరి యెట్లుచెప్పవలెను ?

గు : ఏమనీ చెప్పరాదు. ఏ నిర్ణయమునూ పనికిరాదు, కనుకనే ఈ లేని యెరుకను; అధ్యారోపముచేత ఆరోపించి, దానిని లేదని చెప్పడమునకు శ్రవణ మనన నిధిధ్యాసలున్నూ చెప్పరాదు.

శి : యిది కొంచెం వివరించండి స్వామీ !

గు : లేనివానికి అజ్ఞానమైన లేదు. కనుక అజ్ఞానసంబంధమైన శ్రవణం లేదు. లేనివానికి మనస్సులేదు. కనుక మనోవచ్ఛిన్నమైన మననములేదు. లేనివానికి జ్ఞానంలేదు. కనుక జ్ఞానావచ్ఛిన్నమైన నిధిద్యాసలేదు. తానేలేదు కనుక తనకు సమాధిన్ని లేదు.

శి : మాట అనేటప్పుడు వున్నదని అనవలసినదేకదా !

గు : అన్నప్పుడు వున్నదని కొందరికి భ్రాంతికద్దు. కాని అన్నా విన్నా యెప్పుడూ లేదు.

శి : వున్నట్టు వూరికే తోచడం మాత్రమేనా ?

గు : వున్నట్లు తోచడమున్నూ లేదు, తోచినవార్కి (భ్రాంతి సహితులకు) తోస్తూనే వుంటుంది. చూచేవార్కి (భ్రాంతి రహితులకు) ఎప్పుడూ లేదు. ఏనుగుతిన్న వెలగకాయలో గుజ్జువున్నట్లు ఎవరికి తోస్తుంది? విచారించనివారికి మాత్రమే తోస్తుంది ( విచారించి) చూచే వారికి తోచనేతోచదు.

శి : లేనివాడు కార్యములు ఎట్లా చేస్తువున్నాడు ? వారు వున్నట్లు కాదా ?

గు : భ్రాంతియేగాని వారు లేనివారయ్యేవున్నారు.

శి : వున్నవారివలె యెందుకు తోస్తూవున్నారు ?

గు : అట్లు తోచుటకు భ్రాంతియే కారణము. భ్రాంతులైన వారి కెండమావులు నీళ్ళవలె తోస్తవి. ఎండమావులు ఆవిధంగా తోస్తవి అని తెలిసినవారికి అట్టి భ్రాంతియే వుండదు.

శి : భ్రాంతిరహితు లెట్లావుంటారు ! వారిని గుర్తించుట యెట్లు ?

గు : పాములజాడ పాములకే తెలుసు. తాబేటి తలపు, చేపచూపు, పీని ప్రభావము, వాని గర్భమందు జననమైతేనేగాని తద్గుణములు ఆ నేర్పులూ తెలియవు అట్లే గురుకటాక్షాపాత్రుడైతేనే గాని గురుని అభిప్రాయము తెలియదు.గురుకృపచే మేలుకొంటేనేగాని కల వదలదు. లేనిచో అంథస్సూర్యేందు దర్శనవత్ గానే వుంటుంది. వారంతటివారే వారిని గుర్తించగలరు.

శి : ఇంతకూ అనుభవము కలిగినవారికే యిది అవగతమౌతుందంటారు అంతేనా ?

గు : అనుభవించుటకు అన్యపదార్థమేది ? పరిపూర్ణమెప్పుడు స్వతస్సిద్ధమయేవున్నది. తానేలేడు. లేనప్పుడు అనుభవమెవ్వరికి ? తాను లేకపోవుటే అనుభవము. అపుడే దర్వాజా తీసివేసినట్లు అవును. అంతేకాని యిందుకు అద్వైతశ్రవణాదులు ఏమీ అవసరంలేదు.

శి : ఆ పద్ధతులన్నీ పరిపూర్ణపరబ్రహ్మమును సాధించుట కక్కర లేదన్నమాట.

గు : వున్నదానికి అక్కరలేదు. వున్నది వున్నట్టే వున్నది లేనిది లేకపోయె. కాబట్టిఏమీ అనరాదు.

శి : మరి ఏమి విచారించవలెను ?

గు : ఏమి విచారించిననా .... దానికి మూలములేదు. లేక విచారించినా ఏమీలేదు. తాననే తెరతీస్తే అంతా బయలే. స్వతస్సిద్ధమై నిరావరణమై నిలచియుండును. రెండోది యేమీలేదు. తానేలేడు. కనుక అన్నియు తనతోనే పోయెను.

శి : అది యెట్లు ?

గు : సూర్యుడు లేకుంటే ఆ తాపమూ (యెండ) లేదు. బింబము లేకుంటే ప్రతిబింబమూలేదు.

శి : మరి - గురుశిష్యుల మాటయేమి ?

గు : శిష్యుడు లేనేలేడు. కనుక గురుడు బోధించనూలేదు. గురుడూలేడు, ఎవ్వరూ ఎప్పుడూ లేరు. ఎవ్వరూ ఎరుగనూలేదు.

శి : ఈ పరిపూర్ణబోధచూస్తే శుద్ధశూన్యబోధవలెనున్నదే !

గు : పరిపూర్ణబోధ శూన్యబోధకాదు. ఇతరబోధలే శూన్యబోధలు.

శి : మీదిశూన్యమని అంటే మీది శూన్యమని అనడమేనా ? అంతకంటే ఏమైనా వున్నదా?

గు : అట్లుకాదు. యితరబోధలే నిజముగా శూన్యబోధలు ఎందుకంటే, పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఎన్నడూ లేనేలేక శుద్ధశూన్యమైన యెరుకనే బ్రహ్మమంటున్నారు. వారు చెప్పే బ్రహ్మము నిజంగా శూన్యమయ్యేవున్నది కనుక వారిదే శూన్యబోధలు పరిపూర్ణబోధ అట్లుగాదు. ఉన్న పరిపూర్ణమును వున్నట్లుగాను లేని యెరుకను లేనట్లుగాను చెప్పుచున్న పరిపూర్ణబోధను శూన్యమనుటకు నోరెట్లు వచ్చును ?

శి : క్షమించండి. తెలియక అన్నాను. సరేగాని ఎరుక ఏమీలేదంటున్నారే. మీరు వుండి లేనని చెప్పితిరా ? లేక, లేకుండియే లేనని చెప్పితిరా ?

గు : నీవు వుంటే నేను వుండి చెప్పితిని, నీవేలేకుంటే నేను లేకనే చెప్పితిని, నీవులేవా, నేనూలేను, నేను చెప్పనే లేదు.

శి : ఇవన్నీ యుక్తిమాటలుగా నున్నవి వీనిచే నాకు సంతుష్టి కలుగుటలేదు.

గు : నాయనా ! యివి యుక్తిమాటలు కావు. పరమ సత్యములు నేనెప్పుడు లేనేలేనని నాకు సంపూర్ణముగా ధృడము. ఐతే నేను నేననీ, నేనే బ్రహ్మననీ, నీవొక యావరణమును కల్పించుకొన్నావు. అట్టి నీ కలలోనే దోచిన కలపురుషుడనే నేనుగూడ. నీకలలో నీకు దోచిన సంశయములన్నిటికి సమాధానములు చెప్పి నీభ్రాంతిరహితం చేయుటకు నీకలలోనే నేను గురురూపంగా వచ్చి చెప్పినట్లు నీకే తోచింది. నీవు కలమేల్కొంటే నీ కలాలేదు. నీకు కలభ్రాంతులు లేవు. నీకలలో వచ్చిన నేనూలేను. నేను బోధించనూలేదు. నీవు విననూ లేదు. సర్వమూ కలే.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురు-శిష్య సంవాదరూపము

## పరిపూర్ణ బోధనిష్కర్ష దృఢ ప్రకరణం

గు : ఈ బట్టబయలు స్వతస్సిద్ధమైయున్నది.

శి : స్వతస్సిద్ధమైయున్న బట్టబయలు ఆకాశముకంటె నన్యముగానున్నదా ?

గు : అది, పంచభూతములుగాదు, ఆత్మ, మనస్సు కాలము, దిక్కులుగానుగాదు, అదిషట్కోశములుగాని, విలక్షణమైన సచ్చిదానందముగానికాదు.

శి : అది, యిది, అని స్వానుభవముచే గుర్తించబడగలిగినదా ?

గు : అది పంచరంగుల చిత్రవిచిత్రాల ఆకాశాలుగాదు. వర్ణాత్మకం కానిచో దానిని యిది అనుట ఎట్లు ?

శి : పోనీ, "అస్తీత్యేవోపలబద్ధవ్యః" అని శ్రుతి చెప్పినట్లు "అదివున్నది", లేక "నేను వున్నాను" అని మాత్రమైనా చెప్పదగునా ?

గు : చెప్పదగదు. ఆమాటలేకాదు. 'అంతాశూన్యమే, ఏమీ లేదు అన్నట్టుకాదు. "తత్వమసి" యిత్యాది వాక్యములచేగాని "ఆదిమధ్యాంతరహిత సచ్చిదానందోహమితి నిష్ఠాకురు" సత్యజ్ఞాన మనంతం బ్రహ్మ" యిత్యాదిగా అన్నట్లుగాదు. పరమపదమని, పురుషుడు

సత్యమని, నేను సర్వద్రష్టనై యున్నావని, బ్రహ్మనమని యిత్యాదిగా పలికే భ్రాంతి బ్రహ్మతో నేపోయెను. అనే ఎరుకే ఏమీలేదు.

శి : ఎప్పుడూ ఏమీలేదా ? లేక ఒకప్పుడుండి ఒకప్పుడు ఏమీలేదా ?

గు : ఎప్పుడూలేదు. కనకనే, ఏమీ అనరాదు. ఇది లేనప్పుడు 'అది' అని, అనరాదు, వినరాదు, కనరాదు.

శి : "బ్రహ్మాండంవ్యాపితంవ్యోమంవోమ్నా చావేష్టితంజగత్ అంతర్బహిశ్చతద్వ్యోమం" కనుక స్వతస్సిద్ధంగానున్న వ్యోమం (ఆకాశమే)ననిఅర్జునుడు వూహించినాడు.

గు : గాని, "ఆకాశస్యగుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే" అని చెప్పబడలేదా ? శబ్దగుణమున్న యాకాశము స్వతస్సిద్ధమగు పరిపూర్ణ పరబ్రహ్మ మెట్లగును ? మరిన్ని ఆకాశమంటే అవకాశంకదా ! ఇద్దరుంటే లేక రెండు వస్తువులుంటే ఆరెండు వస్తువుల మధ్యనున్నది అవకాశ రూపమగు ఆకాశము అని చెప్పనగును. కనుక ఆకాశముయొక్క ఉనికి, రెండు వస్తువుల వునికిమీద ఆధారపడియున్నది. అనలువస్తువులే లేనప్పుడు అవకాశమనే మాటకే అర్థములేదు. అట్టి సాపేక్షిక ఆకాశము స్వతస్సిద్ధమైవున్నదని అనవచ్చునా ? అంధునకు అద్దము చేతిలో నున్నా, ముఖము కానరాదు. సరేగదా యెప్పటి అంధకారమే, గురుసాంప్రదాయం తెలియకుంటే అంతమాత్రమే.

శి : చేతనున్న శాస్త్రాలు అంధుని చేతిలోని అద్దంలాంటి వంటారు. అంతేనా ?

గు : శాస్త్రాలేకాదు. పూర్ణగురువుల వాక్యాలు నేర్చి అసాంప్రదాయకు లెంత నోటగొణిగినా అంతే. కేవలం అవి చిలక పలుకుల వంటివే.

శి : అర్థం విచారిస్తే చిలకపలుకు లెట్లగును ?

గు : ఆ అర్థం ఎంత విచారించినా ఎంతటి ప్రజ్ఞావంతులకైనా అసాధ్యం, గురుకృపాప్రసాదసిద్ధులకు మాత్రమే కరతలామలకం, గురూపదేశమేలేకుంటే, అన్నీ నిష్ప్రయోజనమే.

శి : ఐతే, చేయతగిన కర్తవ్యమేమి ?

గు : గురుముఖతః తెలిసికొని, తెలిసిన తెలివే కల అని మేలుకొంటే, ద్వయదోషరహితమైనది. త్రిపుటీరహితమైనది ఏదో, అది అపుడే స్వతస్సిద్ధము.

శి : స్వతస్సిద్ధమగుట అంటే ఏమి ?

గు : సహజముగా సర్వకాలములయందు చావుపుట్టుకలులేవు. తాను లేనప్పుడు, తన పుట్టుకకు పూర్వము, అది పుట్టియుండునేమో ! అని, సంశయంకూడా వుండక పోవుటయే స్వతసిద్ధము. యీ బోధ వింటే ఏమీలేదు.

శి : ఏమిూలేదంటే ఏమిూ ? శూన్యమా ?

గు : ఏమిూలేదంటే ఏభ్రాంతి లేదన్నమాట. వున్నదానిని శూన్యమనీ అనరాదు. పూర్ణమనీ అనరాదు.

శి : అపుడట్టి భ్రాంతిరహితస్థితియందెట్టి సంతృప్తియుండును ?

గు : కమలమునందు తుమ్మెద మకరందమనుభవించుచుండగా సూర్యాస్తమయమైతే, కమలము ముకుళించుకొనును, తుమ్మెద బైటికిరాలేక అందులోనే యెట్లు వుండునో అలాగే.

శి : ఆ అమృతమందు బాగా పొత్తై తిరిగి భ్రాంతిస్థితిలోనికి రాజాలకయుండును. అని అర్ధంచేసుకోవలెనా స్వామీ !

గు : అవును. ఎరుక వదలితే యెరుకపరచేటందుకు యేమీ లేదు. సూర్యునితోనే సూర్యకిరణములుకూడా ఏప్రకారంగా పోవునో అలాగే సర్వమూ యెరుకతోపోవును.

శి : కాని స్వామీ! త్రిమూర్త్యాదులచే వందనీయమైనది. త్రిగుణాతీతమైనది. జగదాధారమైనది. "తమేవభ్రాంత మనుభాతిసర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి" అని చెప్పబడింది. అట్టియెరుకే ఏమీలేదు. అని భ్రాంతి రహితంచేసుకొంటే అవలస్థితి ఏమి ?

గు : నీ ఎరుక లేకుంటే, నీకేమీ లేదు. దృగ్దృశ్య వ్యాపారమేలేదు. పాదులేకపోబట్టి లేదనేవాడేలేడు. ఈ నిరావరణ బోధకు, ఉపాసనాధ్యానధారణ సమాధులు మొదలైనవి ఏమీ అక్కరలేదు. ఇదే దేహంలేని సాంప్రదాయము. అభిమానరహితాచల మార్గం. అట్టిపరిపూర్ణుడైనవానికి ఏమీలేదు.

శి : ఎందుచేత స్వామీ !

గు : దేహమునకు మూలంలేదు. అట్టి నిర్దేహుడైన పరిపూర్ణునికి ఏమోహముండును. పట్టివిడచినా, వూరికే వున్నా, అన్నా, యెప్పుడూ ఒక్కతీరే.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

### గురుశిష్య సంవాదరూపము

## పరమాకాశరహితస్తితి ప్రకరణము

గు : శ్లో ॥ త్యజధర్మ మధర్మంచ ఉభేసత్యా నృతేత్యజ
ఉభే సత్యాన్నృ తేత్యక్త్వాయేనత్యజసి తత్యజ!

శి : ధర్మాధర్మములు సత్యానృతములు త్యజించుటయే గాక దేనిచే అద్వంద్వములు విడచితివో, దానిని గూడ విడువు మంటిరి. దేనిచే విడువవలెను ?

గు : పూనిన విడచినా, జ్ఞానముచేతనేగదా ! అజ్ఞానాన్నే విడువవలెను.

శి : ఎందుకు విడువవలెను ?

గు : సర్వభ్రాంతులకు అజ్ఞానమే మూలకారణం. దానికి పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలంగాని స్థానంగాని లేదు.

శి : జ్ఞానమే బ్రహ్మమని యితరులు సిద్ధాంతంచేస్తున్నారే ?

గు : జ్ఞానమే బ్రహ్మమైతే సుషుప్తియందు ఎక్కడుండెను ? ఏమి గుర్తెరిగెను ? ఒకప్పుడు లేనిది బ్రహ్మమగునా?

శి : ఈజ్ఞానము సుషుప్తిలో లేకపోవుచున్నది. పూర్తిగా మరణంతో పోవుచున్నదిగదా ! దానిని విడుచుటకు ప్రయత్నమెందుకు ?

గు : దీని కూకుడువేరు నెరిగి దాని భ్రాంతినుండి విడుదల పొందవలెనేగాని దీనినుండి కాదు.

గు : మిగిలివుండేదానిని వుందనుటకు లేదనుటకు మునుపుండే యెరుకేది ? తాను, తాను, అనేఅనుభవముకూడా తనతోనే పోయెను ?

శి : యీ జ్ఞానము యొక్క మూలచ్ఛేదన చేయుటకే అయుధము కావలెను ?

గు : గురువాక్యమనే గొడ్డలియే.

శి : గురువాక్యమనే గొడ్డలిచే మూలచ్ఛేదన గావించిన పిదప ఏమి వుండును ?

గు : లేదనే దానిని అడుగు బట్టిస్తే (అనగా రహితపరచుకొంటే) వున్నది వున్నట్లేవుండును. అప్పుడే నిర్భయము యితర భ్రమలుపుట్టవు యెరుక లేకుంటే యిచ్ఛయేమి లేదు. ఆత్మానాత్మలు లేవు సర్వద్వంద్వములు ఏమీ లేకుండును. పట్టువిడుపులు లేని బట్టబయలే స్వతస్సిద్ధమై వుండును. ఈ లేని యెరుక యెప్పుడూ లేదు.

శి : ఎరుక యెటువంటిది ? ఏలాగులేదు ?

గు : ఎరుక అనగా దృక్స్వరూపము. విచారిస్తే నామరూపములులేవు బైట కానరాదు. అంతరమందు చూచినా కానరాదు. కనుక లేనేలేదు.

శి : కాని అంతర్బాహ్య ప్రపంచములు కానవచ్చుచున్నవి. గదా !

గు : చూచేదృక్కే లేకపోతే చూడబడే దృశ్య మెక్కడుండును ? లేనిదృక్కుకు ఏది దృశ్యమగును? కనుక దృశ్యమనేపేరే పనికి రాదు.

శి : వ్యష్టిజ్ఞానములకన్నిటికి సమష్టిరూపమై మూలమైయున్న అధిష్ఠానజ్ఞానమే బ్రహ్మమని యితరులంటే అది యేమీ లేదని భ్రాంతిరహితం చేసుకోవాలని మీరంటున్నారు. అది నిర్వికారంగానే యున్నదిగదా ! దాని రహితమెందుకు చేసుకోవాలి ?

గు : రజ్జువుంటే సర్పభ్రమ కలుగుతూనే వుంటుంది. కనుక సర్పభ్రాంతి యిక యెన్నటికీ కలుగకుండా వుండాలంటే రజ్జువునే దారినుండి తొలగించాలి. అలాగే యీ యెరుకను తొలగిస్తే యేభ్రమాలేదు.

శి : ఎరుకేపోయిన వెనుక ఏమి వుండునంటే పరిపూర్ణము స్వతస్సిద్ధమై వుండునన్నారు. ఎరుకేమైపోవును ? ఎందుపోవును ?

గు : ఎరుక పుట్టనేలేదు కనుక పోనేలేదు. యిదే గుట్టు అది తెలిస్తే ఆపైన యెరుగుటకు ఏముండును ?

శి : యీబోధ యెట్లు దృఢంకాగలదు స్వామీ !

గు : పశువును పలుపుతో బంధించినట్లు. గురువాక్యముచే బంధిస్తే యెరుక కదలకుండా వుండును. యీ మర్మము జాగుసేయకుండా వుండును. యీ మర్మము జాగుసేయకుండా తెలుసుకోవలెను.

శి : ఎందుచేత స్వామీ !

గు : కాలం అల్పం విఘ్నములనంతాలు దాహమైనపుడు మంచినీటిబావి త్రవ్వనారంభిస్తే ప్రాణహాని సంభవిస్తుంది. దీపమున్నపుడే యిల్లు చక్కజేసుకోవాలి. ముందు మరణమున్నది చూచుకో ! ఆ కాలసర్పము కాచుకొని కాటువేయచూస్తోంది. మానవుడవై పుట్టినందుకు యిక మళ్ళీ పుట్టకుండా చేసుకో !

శి : పరిపూర్ణ మెట్లు దర్శింపనగును ?

గు : అది యెప్పుడూ స్వతస్సిద్ధమయ్యేవున్నది. దానికొరకు ఏ సాధనా చేయనవసరంలేదు. కానవచ్చే చిత్రమునకు గట్టెక్కి చూడవలెనా ? కొండకు గురిపెట్టుటకు ఏమి కష్టము చేయవలెను? ఏ సాధనా, ఏయోగమూ ఎందుకూ పనికిరావు.

శి : ఏ నడవడి వుండనక్కర లేదా స్వామీ !

గు : ఆశవదలితేచాలు. దేనియందు ఎట్టి ఆశవున్నా అనర్థకుడౌతాడు.

శి : మీరు చెప్పే యెరుకనే ఇతరులు పరిపూర్ణ మంటున్నారు స్వామీ ! అంతేకాదు, యీ యింద్రియ గోచరమగు సమస్తమూ వస్తుతః బ్రహ్మమే నంటున్నారు.

గు : ఒకసారి కానవచ్చి ఒకసారి కానరానిది పరిపూర్ణ మెట్లగును ? ఎరుక విశ్వములు రెండూ యెరుకే రెండూ యేమీలేవు, కన్నులులేకుంటే చూపేలేనట్లు, సువర్ణమే లేకుంటే సువర్ణ భూషణములు లేనట్లు కారణరూపమైన యెరుకే లేకుంటే కార్యరూపజగత్తున్ను లేదు. ఎరుక లేకుంటే ఏమీలేదు. పరిపూర్ణమందు ఎరుక పుట్టనేలేదు.

శి : పుట్టనిదానిని పుట్టకుండా చేయవలసినపని ఏమున్నది ?

గు : శెభాష్; బట్టబయలులో ఎరుక పుట్టనేలేదు. పుట్టనిది ఒకప్పుడు వున్నదని ఒకప్పుడు పోయినదనీ చెప్పరాదు. గురువు శిష్యుని కలనుండి మేలుకొలువనేలేదు, ఉపదేశమే అబద్ధము. వినుటకు శిష్యుడూ, అనుటకు గురువూ లేరు. గురుశిష్యులు లేరనే ఎరుక మునుపే లేదు. లేదని అన్నదీ లేదు.

శి : ఐతే ఏవేదాంతమూ అక్కరనేలేదు.

గు : పైన చెప్పినవన్నీ ఆరూఢిని వాక్యాలుగాని, ఓనమాలు రానివాని మాటలు కావుసుమా ! ఆరూఢునికి (అనగా గురువాక్యంచే మేలుకొన్న వానికి) తనతోగూడా ఏమీలేదు, అన్నీ ఎరుకతోనే పోయెను.

శి : బ్రహ్మము, కర్మము అను రెంటిలో గుర్తెరిగే బ్రహ్మము పుట్టనేలేదన్నారు. ఇక కర్మముమాట ఏమి ?

గు : బ్రహ్మము లేకుంటే కర్మ యెట్లావుంటుంది ? గుర్తెరుగకుండా కర్మ ఎవరున్నూ చేయరుగదా!

శి : పరిపూర్ణుడు కర్మచేయుచున్నాడా ? మానివేసినాడా ?

గు : ఎరుక భ్రాంతిలేకనే కర్మ చేయును. కనుక చేసియు చేయనివాడే అగుచున్నాడు. కనుక అతని కర్మ ఏవిధంగానూ బంధకారణము కాదు. కనుక అతనికి జ్ఞానకర్మలు రెండూ లేవు.

శి : సరేకానీ, స్వామీ ! ఎరుక లేకుంటే, పరిపూర్ణము స్వతస్సిద్ధంగా వుండియే వున్నది అంటున్నారు. ఎరుక పుట్టనే లేదంటున్నారు. యిక పరిపూర్ణం స్వతస్సిద్ధం కాని దెప్పుడు?

గు : అది ఎవ్వుడూ స్వతస్సిద్ధమే. సాధనాంతరనిరపేక్షం మయ్యేవున్నది. కాని మరుగుగావున్నది. ఎరిగే బ్రహ్మ అణిగితే, మరుగు లేదు. యింటికి దర్వాజా తీసివేసినట్టు అగును.

శి : స్వామీ ! ఆరూఢులైన పరిపూర్ణ భావజ్ఞులు పరిపూర్ణమున ఎరుకే లేదంటున్నారుగదా! మీరు వుండి చెప్పుచున్నారా ? లేకుండియే చెప్పుచున్నారా ? లేక చెప్పినారంటే వంధ్యాపుత్రుడు వచించినాడన్నట్లుంటుంది. మరిన్ని మీరు లేకుంటే చెప్పనేచెప్పరుగదా! వుండియే చెప్పితిమంటారేమో ? మీరు వుండగా ఏమీ లేదని యేలాగంటిరి ?

గు : నీకు ఏలాగుతోస్తే అలాగే అనుకో, నీవు వున్నావా, నేను చెప్పినాననుకో, నీకలలోనే నేను తోచినాను నీ కల రహితముకొరకు బోధించితినని నీవే అనుకొన్నావు. మేలుకొని కలగనే నీవు లేకుంటే, నీకలలో తోచిన నేనూలేను ; నాబోధా లేదు; కలగన్న నీవు సత్యమని యింకనూ కల భ్రాంతిలోనే నీవుంటే నీవలెనేనూ, నేను చెప్పనది, నీవు విసునదీ, అంతా సత్యంగానే తోస్తుంది. నాకుమాత్రం ఏమీలేదు. ఎప్పుడూ ఒక్కతీరే, నేను వున్నట్టునీకు తోచినా తోచవచ్చునుగాని నాకు ఏమీలేదు.

శి : యిది తమాషాగానే వుంది. మీకేమీ లేదంటున్నారే, అది ఎట్లో కొంచెం వివరించండి స్వామీ !

గు : నీ కలలోనే నేను వచ్చినట్లు నీతో వ్యవహారములు మాట్లాడేనట్లు నీకు తోచినదిగాని నీకు కలవచ్చిన సమాచారమే నాకు తెలియదు, నీవు మేలుకొంటే, కలగన్ననీవు, కలలోదోచినా నేనూ, కలవ్యవహారము అంతా ఏమీలేదు. నాకు చూద్దామా అసలు కలయే లేదు. ఈమర్మం తెలిస్తే తేటగానుండును. అన్నీ నీకే తోచును. గనుక అంతా నీవే, నేను యేమీలేను. కనుక నీకు యెన్ని తోచినా నాకు నిర్భయమే.

శి : మెలకువ వచ్చిన పిదప స్థితి ఏమీ స్వామీ !

గు : కలగన్న నీవూ, ఆకలలో తోచిన నేను లేనేలేము, నేను చెప్పడము జరుగలేదు. నీవు వినడమూ జరుగలేదు. తోచడము లేకపోబట్టి లేదనడమూలేదు. నిరావరణమందు ప్రవేశించితే నిర్భయము. జననమరణ రహితము బాధాలేదు, బోధాలేదు.

శి : యితర బోధలుమాత్రమెందుకు పనికిరావు ?

గు : అవి వింటే, నట్టేటిలో పుట్టిముంచినట్టు ముంచుతవి, బండ కట్టుకొని బావిలో పడ్డట్టే. పైకి యిక తేలనీయవు జననమరణ ప్రవాహంలో మునుగుతూ తేలుతూ వుంటాడు. అంతకంతకు యెరుక బలీయమైపోవుచుండును.

శి : పరిపూర్ణబోధయో !

గు : నీటినివదలిన మొసలిబైట మూరెడైన ప్రాకలేనట్లుగానే పరిపూర్ణ బ్రహ్మమున్నదని తాను లేనని గుర్తించిన యెరుక నిర్వీర్యమైపోవును. యిక ఏ వాదములు ఏమతములు యెందుకూ పనికిరావు నిజము తెలిస్తే నిర్భయము. మనము ఏప్పుడును లేనేలేము. దారుప్రతిమ జటియనట్టే మనకు నిర్భయము. పాము ఒకటి తమ్ము తరిమి తరిమి కరుచుచున్నట్లు యితరులు భయపడుచున్నారు అది త్రాడే సర్వం లేనేలేదన్న విషయం యెరుగక భయపడుదురు. మనము పుట్టనేలేదు. ఎప్పటికీ నిర్భయమే మన ప్రవర్తన మనకే తెలుసునుగాని యితరులకు తెలియదు. పరబ్రహ్మమనగా ఎరుక బ్రహ్మకంటె పరమైనదని వారెరుగరు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురు-శిష్య సంవాదము

## నిరావరణ బోధ ప్రకరణం

గు : నిరావరణమగు పరిపూర్ణమందు ఒకప్పుడు యెరుక వున్నదని ఈబోధవల్ల పోతుందనీ అనరాదు.

శి : ఎందుచేత అనరాదు స్వామీ !

గు : రజ్జువునందు పాము ఏకాలమునందైన నుండెనా ? పామునే భ్రాంతి రహితమైపోయినప్పుడా పాము రజ్జువునందుగాని మరొకచోటగాని దూరెనా ? జలఘటములో సూర్యుడు చొరబడి, జలాభావమందు మళ్ళీపోయి సూర్యునితో కలసెనా ? అలాగే యెరుక పరిపూర్ణములో నుంచి రానూలేదు మళ్ళీ పోనూలేదు.

శి : పరిపూర్ణులైన మహాత్ములకు నిమిత్తమాత్రముగా ఎరుక వుందని కొందరంటారు అది యెట్లు?

గు : అవును, కోరలు తీసిన త్రాచువలె ఆ యెరుక నిరపాయము, కానవచ్చి సంచరించినా లేనివాడే.

శి : యెరుక లేనేలేకపోతే యిన్ని యుక్తులు యింత బోధా యెందుకు స్వామీ !

గు : పదిమంది పది చేతులువేస్తె కొండయైనా బెండువలె తేలికైపోతుంది. బుద్ధిమంతుడైతే, స్థాలీపులా కన్యాయంగా నిమిషములో గ్రహిస్తాడు అన్నము కలియబెట్టి ఒక్క మెతుకు పట్టిచూచినా పచనమైనట్లు ఎట్లు తెలియునో అట్లే ఒక్క యుక్తిని బాగా విమర్శించినా గ్రాహ్యము కాగలదన్నమాట. యెన్ని వాక్యములు విన్నా గురువాక్యం దృఢమగుట కొరకే. దృఢంకాని వానికొరకే వాదన విస్తారం కావలెను.

శి : యెరుక యందలి భ్రాంతి సంపూర్ణంగా నశించాలంటే ఏమి చెయ్యాలి ? దృష్టాంత పూర్వకంగా శెలవీయండి స్వామీ !

గు : ఎరుకయనే పక్షికి, మనోబుద్ధులే రెక్కలు, జ్ఞానాజ్ఞానములు చరణములు, జీవుడు పుచ్ఛం, అనగా తోకఈశ్వర్యు మధ్య ప్రదేశం. సర్వమును గుర్తెరిగే శుద్ధ చైతన్యమే శిరస్సు ఈ పక్షికి పాదములువిరిస్తే రెక్కలతోటి, రెక్కలు విరిస్తే పాదములతోనూ వర్తిస్తుంది. రెండూ విరిస్తే దొర్లుకుంటూ పోతుంది. కనుక శిరచ్ఛేదన చేస్తే మళ్లీ భ్రాంతి కారణం కాజాలదు. యిక భ్రాంతులు యెన్నటికీ పుట్టవు. యెరిగే తానుపోతే యేమీలేదు.

శి : మరివున్న పరిపూర్ణముమాటయేమి ?

గు : లేనిదానిచేతనే వున్నదానిని వుండజూచుకొని లేని దానిని లేదని నిశ్చయపరచుకొంటే లేనిది లేకనేపోవును అగ్నివుంటేనుశకప్పుతూనే వుండును, అగ్ని చల్లారితే పైనుశియున్నా బాధలేదు. అనర్థనివృత్తి అయినవుడు వున్నదన్నమాటా లేదన్నమాటాలేదు. లేనివానివర్తనకున్నూ వున్నవాని వర్తనకున్నూ సమముకాదు.

శి : ఎరుక ఎప్పుడు తోస్తుంది ? ఎప్పుడు పోతుంది ?

గు : తన్ను మాత్రం యెరిగితే పుట్టి తోస్తుంది. పరిపూర్ణమును యెరిగితే గిట్టింది.

శి : అట్లుయెరిగితే తానువుండి తన అజ్ఞానంపోతే లక్షణంగా వుండదా.

గు : తానుండగా అజ్ఞానంపోదు.

శి : ఎందుచేత ?

గు : అజ్ఞానంపోతే తజ్జన్యమైన వ్యవహారమెట్లు సంభవించును ? ప్రపంచజ్ఞానము అజ్ఞానకార్యమేగదా. తాను "అహం బ్రహ్మాస్మి" అనే అఖండ జ్ఞానముతో వుంటే ప్రపంచ వ్యవహారము తోచనే కూడదుగదా !

శి : యింగువకట్టిన గుడ్డ యింగువలేకపోయినా, వాసన వున్నరీతిగా అజ్ఞానము నశించినా దాని వాసన కొంతయుండును.

గు : ఐతే, కలవచ్చిన శరీరం మేలుకొంటే సగముండి సగం పోవునా ? తాను వున్నంతసేపూ సర్వంవుండును అన్నీ తనతోనే నశించును. సూర్యుడస్తమిస్తే సూర్యకిరణములు కాంతినిస్తూ మిగిలివుండునా ? అట్లే

శి : ఎరుక త్రికాలాబాధ్యమని కొందరు అంటున్నారు గదా ?

గు : అంటారుకాని, తానే లేనివానికి యీమాటలు ఏమి నిజము ?

శి : ఎందుకునిజముకాదు ?

గు : వెనుక పుణ్యపాపములు చేసి యిప్పుడనుభవిస్తున్నానని యిపుడు చేసిన దానిఫలము ముందనుభవిస్తాననీ కనుక పూర్వోత్తరజన్మలున్నవనీ కనుక మూడు కాలముల యందూ వున్నదనీ అంటారు. ఐతే తాను రాకమునుపు తాను లేడు. గురువాక్య శ్రవణానంతరం లేడు, కనుక మధ్యాలేడు, యిప్పుడే లేడుకనుక ముందూవుండడు.

శి : ప్రారబ్ధము ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడు గదా !

గు : తానువున్నాడు (తాను సత్యమనే భ్రాంతిలో వున్నాడు) కనుక ప్రారబ్ధము అనుభవిస్తుననుకొంటున్నాడు. సంకెళ్ళుంటే పరుగిడుట అసాధ్యమెట్లో ఎరుకనే సంకెళ్ళుంటే కర్మానుభవమునుండి తప్పించుకొనలేడు. గురుకృపచే, యీ సంకెళ్ళు వీడితే వానికెట్టి కర్మానుభవమూలేదు.

శి : సంకెళ్లు వీడుట అనగా ఎరుకేమైపోవును ? ఎక్కడకేగును ?

గు : ఎక్కడికీ పోనక్కరలేదు ఎరుకయొక్క ఆవరణము నుండి భ్రాంతినుండి విముక్తి చెందుతాడు. అపుడు పాపమనే భయము మోక్షమనే మోదమూ రెండూ వుండవు.

శి : ఐతే పరిపూర్ణులకు పాపపుణ్యముల భయమేమీ లేదన్న మాట !

గు : పరిపూర్ణబోధయందు ప్రవేశించిన ప్రతివాడూ పరిపూర్ణుడు గాడు. గురుకృపచే బోధ అరూఢపరచుకొన్న మహాత్ముని విషయంలో మాత్రమే చెప్పిన మాటలు సుమాయివి!

శి : వారికి మాత్రము పాపపుణ్యముల భయమేలయుండదు ?

గు : పాపపుణ్యములు, బంధమోక్షములు, జననమరణములు యివిఅన్నియు యెరుకయొుక్క ఆవరణం లోపలవున్న వారికి మాత్రమే. ఆవరణరహితులై నివారణ పరిపూర్ణ బోధ చెందిన మహాత్ములకు మాత్రమేమీలేదు.

శి : మీమాటలు చాలా బాగావున్నాయి. ఒక దృష్టాంత రూపంగా దృఢపరచండి స్వామీ !

గు : తోటవేసి, దానికి కాపలాదారున్నట్లుగా వేషము వేసిన బొమ్మను అక్కడుంచినాడనుకో, కాని పశుపక్ష్యాదులకు ఆ బొమ్మవచ్చి తమ్మేమైన చేయునేమోననే భయమేమీ లేకవచ్చి తోటయందలి ఫలములను భక్షిస్తే అకృతిమ విగ్రహమేమైనా చేయగల్గునా ? భయాదులకు కారణమైన యెరక భ్రాంతిరహితులైన పరిపూర్ణ భావజ్ఞులకు మాత్రమే నిర్భయము.

శి : ఆపరిపూర్ణ మెట్టిదో దాని ధర్మములు, దాని లక్షణములు యెట్టివో శెలవీయండి స్వామీ!

గు : అది కేవలం నిరావరణరూపం. దాని కెట్టిధర్మములూ ఎట్టి లక్షణములున్నూ చెప్పరాదు.

శి : ఐనా ఎరుకే పరిపూర్ణమని భ్రాంతి కలుగకుండా అది యెట్టిదో కొంచమైనా తెలియుటకు చెప్పండి స్వామీ !

గు : అది నిజముగా అద్వితీయము, సంపూర్ణ వ్యాపకతగలది విభువున్నూ అపరిచ్ఛిన్నమున్నూ అయివున్నది.

శి : ఇవన్నీ యెరుకకున్ను చెప్పెదరుగదా !

గు : కార్యరూపములందు కారణవస్తువు అను స్యూతమైయుండుటే వ్యాపకతా ధర్మము కనుక ఎరుక వ్యాపకత్వ లక్షణములు గలదనుట యదార్థమే, అట్లే సర్వాణువుల సంయోగ రూపకమైనదే విభువుకనుక యెరుకయున్ను విభువనదగియున్నది, కాని, ద్వైతా ద్వైతములుగా ఖండా ఖండములుగానూ యెరుక కానవస్తువున్నది కనుక దానిని అద్వితీయమని అపరిచ్ఛిన్నమనీ అనరాదు కాని పరిపూర్ణము అట్లుగాక ఎన్నడూ పరిచ్ఛిన్నత్వము, ఖండత్వము, నొందలేదు. దానియందు ఏమీలేదు. కనుక కేవలమైన అద్వితీయత్వము దానికే గలదు. సకలదేశములయందున్నది కనుక వ్యాపకము. ఆవరణ రహితమై దానిని మించినది ఏమీలేదు కనుక విభువున్నూ అనవచ్చును కాని దానిప్రత్యేక లక్షణములు బోధకొరకు చెప్పాలంటె కేవలం అద్వితీయత్వము అపరిచ్ఛిన్నత్వమున్ను చెప్పుకోవచ్చును. కనుకనే దానిని మహాద్వైతమని వాడేరు. యింతకూ అది వాక్కుకందదు. అని మరచిపోకు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురు-శిష్య సంవాదరూపము

## భ్రమనిర్ణయము - శ్రవణమననాదులు

శి : స్వామి ! ఎరుకను విడిచిన పరిపూర్ణుడెట్లుండును ?

గు : అతనికి సవికల్ప నిర్వికల్ప జ్ఞానములు లేవు. నేనునీవూ, నావారు, అన్యులూ అనే భేద దృష్టి లేదు. నేను బ్రహ్మమనిగాని జీవుడననిగాని దేహమనిగాని భావములేదు. మరిన్ని అవరణ విక్షేపములు, దేహమోహములు, జ్ఞానాజ్ఞానములు, సుఖదుఃఖములు లేవు, శ్రద్ధాశ్రద్ధలు, కర్తృత్వభోక్తృత్వములు, భావాభావములు, చలాచలములు దృగ్దృశ్యములు, సదసత్తులు జననమరణములు మొదలగు సర్వద్వంద్వములు అతనికి ఏమీ లేవు.

శి : అతడు సంపూర్ణ మౌనములో నిర్వాసనా మౌన నిష్ఠయందే యుండిపోవునా ?

గు : అతనికి మౌనమూలేదు. తూష్ణీభావమూ లేదు. సాక్షత్వమూలేదు.

శి : అది యెట్లు స్వామి !

గు : మౌనమునందు కూడా తానుంటున్నాడు గనుక మౌనమూ అహంకారమే, తూష్ణీభావమూ అహంకారమే, తాను లేకపోవడమే పరమ నిరహంకారము. ఇదే సంపూర్ణమైనది. సూర్యునియందు చీకటి లేనట్లు పరిపూర్ణునికి పంచభ్రమలూ ఏమీలేవు.

శి : పంచభ్రమలను వివరించండి స్వామి !

గు :
1) సచ్చిదానంద స్వరూపమై జగత్కారణమైన ఎరుకవున్నదనుట మొదటి భ్రమ
2) పరిపూర్ణమందు, జగదుత్పత్తి స్థితిలయములు జరుగుచున్న వనుట రెండవ భ్రమ.
3) పరిపూర్ణము దృశ్యమగుననుకొనుట మూడవభ్రమ
4) ఆకాశమువలె - శూన్యమువలె జగత్తునకంతరముగా పరిపూర్ణమున్న దనుకొనుట నాలుగవ భ్రమ
5) నేనే పరిపూర్ణ బ్రహ్మము. పరిపూర్ణ పరబ్రహ్మమే నేను అనుకొనుట పంచమ భ్రమ.

శి : ఈ భ్రమ లెట్లుతొలగ గలవు ?

గు : అంతటా నిండి నిబిడీకృతమై పరిపూర్ణమే యున్నది అది అవేద్యము, అగ్రాహ్యము, అగోచరము. అందు సృష్టి కారణమైన యెరుకేలేదు. ఎరుక పుట్టనేలేదు. కనుక

చూచేదేలేదు. కనుక దృశ్యమను ప్రసక్తియేలేదు. నేనే లేనపుడు నేను పరిపూర్ణమెట్లు కాగలను ? యీపంచభ్రమలు దేనికి కలుగుచున్నవో అయెరుకేలేదు.

శి : ఈ బోధయందు శ్రవణ మనన నిధిధ్యాసలున్నవా ?

గు : గురు శిష్య న్యాయమున్నది కనుక శ్రవణ మనన నిధిధ్యాసలున్ను చెప్పవచ్చును. గురువాక్యము ద్వారా నాకు మూలం లేదని తెలియుట శ్రవణము. విన్నదానిని శిష్యుడు మనస్సుతో తర్జన భర్జనలు చేసుకొనుటే మననము. మనస్సును దానియందు ఏకాగ్రమోనర్చుటమే నిధిధ్యాస. తాను లేనని నిశ్చయము కలుగుటయే సమాధి.

శి : తాను లేననుట నిర్వికల్ప సమాధియని చెప్పనొప్పును, మరి సవికల్ప సమాధి ఏది ?

గు : సజాతీయ, విజాతీయ, స్వగభేద ప్రత్యయశూన్యంగా నిరావరణ పరిపూర్ణమును తెలియుట సవికల్ప సమాధియనజెల్లును, సర్వత్రిపుటీ రహితమై, నిర్విషయావస్థలు కూడా వాచ్యార్థలక్ష్యార్థముల రెంటియందూ లేనిదే నిర్వికల్ప సమాధి.

శి : నిర్విషయావస్థలేమో వాని వాచ్యార్థ లక్ష్యార్థములేమో వివరించండి స్వామీ !

గు : లయ, విక్షేప, కషాయ కరట రసాస్వాదనాలనేవి పంచ నిర్విషయావస్థలు, లయమనగా బోధ చెప్పుచుండ నిద్ర వచ్చుట వాచ్యార్థము. గురువాక్యమును విచారిస్తూ తన్ను మరచుట లక్ష్యార్థము, విక్షేపమనంగా వాచ్యార్థములో ప్రపంచ వృత్తులతో కూడియుండుట. పరిపూర్ణబోధయందు విచారణ చేస్తూయుండుట లక్ష్యార్థము.

కషాయమనగా : పరిపూర్ణ మొక్కదానినే ధ్యానమందుంచటం వాచ్యార్థము. పరిపూర్ణమనీ, చిజ్జడములనీ తెలియక వానియందు వృత్తి నిలువక, శూన్యమైపోవటము లక్ష్యార్థము.

కరటమనగా : దుర్విషయాపేక్ష వాచ్యార్థము. తాను లేనని పరిపూర్ణము కలదని నిశ్చయములక్ష్యార్థము.

రసాస్వాదన : సింహస్వప్న రీతిగా గురువాక్యానంతరం లేననే నిశ్చయం వాచ్యార్థం. లేననీ, వున్నాననే మాట లేకుండా పరిపూర్ణ నిరావరణ సమాధిచేత యేమీ తెలియకుండా వుండటం లక్ష్యార్థము.

శి : ఈ అవస్థలన్నీ పరిపూర్ణ బోధయందు కలిగి తీరవలెనా ?

గు : అవసరంలేదు. భ్రాంతిరహితం ఐతేచాలు.

శి : భ్రాంతిరహిత స్థితిని కొంచం వివరించండి స్వామీ !

గు : పరిపూర్ణభావజ్ఞుడు లోకులకు యథాప్రకారంగానే గానుపించును. పరిపూర్ణభావజ్ఞునికి ప్రపంచమున్ను యధా ప్రకారం పూర్వమువలెనే గోచరించును. కాని ప్రపంచం మళ్ళీ చూచినా యిపుడే భ్రమలేదు.

శి : అదెట్లా దృష్టాంతపూర్వకంగా తెలపీయండి స్వామీ !

గు : ఇంద్రజాలము చేసేవాని కట్టుకు లోపల వుండి చూస్తే అంతా సత్యముగానే దోచి భ్రాంతి కలుగును. కాని వానికట్టుకు అవల నుండి చూచేవానికి ఆ భ్రమయేలాగున కలుగదో అలాగే, అంతేకాదు. ఆ ఇంద్రజాలిక దృశ్యములు యిద్రజాలకుని కెట్లు భ్రాంతి కల్గించును ?

శి : అవును మాయ కధిష్టానముగానున్న పరమేశ్వరుని మోహ పెట్టజాలదని యితరులున్ను చెప్పుచున్నారు. ఇక పూర్ణబోధయొక్క విశేషమేమి ?

గు : ఇంద్రజాలకుడే లేడు కనుక జాలములేదు దృశ్యములు లేవు. అలాగే తాను లేక చూచేవానికి ఏభ్రాంతిలేదు ఇది కేవలం పరమాచార్య కృపాలబ్ధము. ఇది అశరీర సాంప్రదాయకము. లేక నిర్దేహ బ్రహ్మావాదము.

శి : దేహబ్రహ్మావాదమేమిటి, నిర్దేహబ్రహ్మావాదమేమిటి ? కొంచెం వివరించండి స్వామీ !

గు : ఒక్క పరిపూర్ణ బోధ మార్గస్థులు తప్ప మిగతావారంతా దేహబ్రహ్మావాదులే అందరూ గుర్తెరిగే దేహబ్రహ్మావాదులే అందులో కొందరుగుర్తెరుగని, దేహబ్రహ్మావాదులు.

శి : వీరిరువురురకు తేడాఏమి ?

గు : యిరువురూ సమానమే. కుడి. ఎడమ వాసితేడా మాత్రమే చూచే దేహము కారణము. చూడని దేహము కార్యము రెండూ ఏకమే దానిని విడచి యిదిలేదు. దీనిని విడచి అదిలేదు ఇట్టి నిరావరణ నిర్దేహబోధను అందరికి చెప్పకూడదు.

శి : ఎట్టివారికి చెప్పకూడదు ?

గు : అసంభావన, విపరీతభావన, కుతర్కములు వుంటే చెప్పకూడదు.

శి : అ అసంభావనా, విపరీతభావనా, కుతర్కములెట్టివో వివరించండి స్వామీ !

గు : నీవులేవు; నీకు భ్రాంతిలేదు; జగత్తులేదని గురువు చెప్పినది వాస్తవమా అవాస్తవమాయన్న సందేహమే అసంభావన విపరీతభావయనగా : గురువు చెప్పినది, పరిపూర్ణముకాదు; ప్రత్యక్షముగా కానవస్తూన్ననే నెట్లులేను ? అంటూ యెన్ని శ్రుతియుక్తి అనుభవములు చెప్పినా అవి అన్నీ అబద్ధమేనని అనుకోవడము.

కుతర్కమనగా : గురువు చెప్పినయుక్తులు యేలాగైనా ఖండించి తనయుక్తియే నిలుపుకొనవలెనని, గురువు చెప్పినదానిని విశ్వసించకూడదు, అనే పట్టుదలతో వాదించుట ఈ మూడు రకముల వారికి యీ బోధ చెప్పగూడదు.

శి : అయ్యా ! యీ అసంభావనా, విపరీతభావనా, కుతర్కములు లేకుండా పోవలెనంటే మార్గమేమి ?

గు : సద్గ్రంధములు (పరిపూర్ణబోధ గ్రంధములు) చదివినచో అసంభావన వదలును, అట్టి గ్రంధమందలి యుక్తులను మననము చేయుచుండినచో విపరీతభావనయున్నూ తొలగును, గ్రంధస్తసిద్ధాంతములను నిధిధ్యాసచేయుట వలన కుతర్కమున్ను వదలును.

శి : అయ్యా విషయములను గ్రుడ్డిగా నమ్మకుండా తర్జన భర్జన చేసి తర్కించుటకూడా ఒక దోషముగా పరిగణింపబడునా ?

గు : కాదు కాదు గురువు చెప్పిన యుక్తి మనస్సున పట్టించుకొని, భావరూఢిచేసుకొని, యింకా ఏమైనా సందేహాలు వుంటే, మనఃపూర్వకముగా గురువులనైననూ పెద్దలనైనను అడగడము కుతర్కమవదు అట్టివాడే నిజంగా బోధాధికారి గురుభక్తిన్ని పెద్దలమైత్రిన్ని లేని అహంకారి బోధాధికారి యెట్లగును ? ఎంత ప్రజ్ఞయున్నా వ్యర్థమే అట్టివానికి బోధమర్మధర్మములు గురువుచెప్పడు వానికి తెలియదు. వుభయభ్రష్టత్వమగును.

శి : అయ్యా ! శిష్యుడు గురుబోధ యెట్టిస్తితిలో గ్రహించగలడు ?

గు : కర్త, కర్మ, క్రియా రహితముగా తెలియవలెను.

శి : అదియెట్లు ?

గు : అహంకార రహితుడై మిధ్యాజ్ఞానమును మిధ్యాభ్రాంతులను మిధ్యగా తెలియడమే నిర్దేహస్తితి. గురుకృప చేతనే యీ స్తితియును లభ్యము కావలెను. ఒక్క మహానుభావుని కృపచేత అనేకమంది కృతార్థులగుదురు.

శి : అట్టి మహానుభావులు చాలా అరుదుగా వుంటారు.

గు : నిజమేకాని, ఒక్కయింటి మీదపుట్టిన అగ్ని పూరంతా కాల్చి వేయగలదు. ఒక్క పురుషుని ద్రవ్యముచే త్రవ్వించిన కూపతటాకాదులు అనేకుల దాహశాంతి కల్గించును. అట్లే ఒక్క సద్గురుని యొక్క ఆధ్యాత్మిక శక్తి లోకమునంతనూ ప్రభావితం చేయగలదు.

శి : తత్వమశ్యాది మహావాక్యవిచారణచే యీ పూర్ణబోధ స్తితియెందుకు చేకూరదు ?

గు : మేఘములుచేత అంధకారమణగి పోనట్లుగా మహవాక్య విచారణ రూపమగు యెరుక బోధచేత యెరుక రహితం కాదు. అంధకారాన్ని పటాపంచలు చేయాలంటే తేజస్సే కావలెను. ఒక్క పరిపూర్ణ బోధచేతనే ఎరుక రహితం కాగలదు.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురుశిష్య సంవాదరూపము

## నిర్దేహబోధ నిశ్చయ ప్రకరణము

గు : గురుకటాక్ష వీక్షణము లేకుండా తనంతతాను ఎంతవాడైనా యీ బోధ గ్రహించుట, నిలుపుకొనుట సాధ్యంకాదు.

శి : ఎందుచేత స్వామీ !

గు : ఈ బోధ మహాసూక్ష్మము గనుక గురుకృపాపాత్రులకు మాత్రమే సులభం. కొండకు గురిపెట్టినచో ఎట్లు లక్ష్యము తప్పదో అట్లే సుసాధ్యము.

శి : యీ బోధకు లక్ష్యము ఏది ?

గు : తాను లేకపోవడమే.

శి : లేకపోవడ మనగానేమి ? అందు కేమిచేయవలెను ?

గు : కొందరు గురువాక్య రీత్యా మిథ్యాత్మ నిశ్చయమే తాను లేకపోవడం అని అన్నారు.

శి : ఐతే తమ అభిప్రాయమేమి ?

గు : లేదు; లేదు; అంటూవున్నదేదో నిశ్చయము లేకుండా వుంటే శూన్య వాదియగును.

శి : మరియెట్లు ?

గు : పరిపూర్ణమును వుండ జూచుకొని తాను లేకపోవలెను.

శి : అపుడు తాను పరిపూర్ణ మగునా ?

గు : తాను లేకపోయిన పిదప పరిపూర్ణమయ్యేది. ఏది ? పరిపూర్ణమున్నదని తెలియుట మాత్రమే.

శి : తాను లేకపోతే పరిపూర్ణమును జూచేది ఏది ? పరిపూర్ణమును తెలియుటయా ? లేక తాను లేకపోవుటయా ఏది ముందుజరుగును ?

గు : పరిపూర్ణమును చూస్తూనే తానే లేకపోవును, అనగా రెండును ఏకకాలమందే జరుగును.

శి : ఆవిధంగా యెరుక పోతే యిక స్థూలదేహము మొద్దువలె ఒకచోట పడియుండును?

గు : కాదు కాదు. ఆ పిదప అతనికి ఎట్టి సంశయాలూ వుండవు యిక యెట్టి నిర్ణయములూ చేయడు. దేహాభిమానము గాని అహంకారముగాని యుండవు.

శి : ఐతే దేహాభిమానం వదలుట యంటే బాహ్య శౌచాదుల ప్రసక్తి వదలి దిగంబరుడౌతాడా? తిట్టినా కొట్టినా ఏమీ లెక్కచేయక మొండిగా బ్రతుకుతాడా ? నాకర్థంకాలేదు స్వామీ!

గు : స్వతంత్రము విడవడమే దేహాభిమాన పరిత్యాగము, అదే అహంకార నిరసనము.

శి : స్వతంత్రం విడచి పరతంత్రుడై యుండాలా ! ఎవరికి ?

గు : గురువాజ్ఞ ప్రకారము వర్తించుటే స్వతంత్రము విడచుట గురువాజ్ఞ నలంఘ్యముగా భావించవలెను. గురువాజ్ఞ మీరినచో గురువునకిచ్చిన దక్షిణనపహరించిన దోషము వచ్చును.

శి : ఐతే గురువునకు సంభావన యిస్తూ వుండాలా ?

గు : గురువు చెప్పినమాట వినటమే గురు సంభావన. ఎరుకను వుంచుకోకూడదని గురువు చెప్పినాడు. కనుక దానిని విడచి పెట్టడమే సంభావన.

శి : ఎరుకను యేది విడచి పెట్టును ?

గు : యెరుకను యెరుకే విడిచిపెట్టును.

శి : ఇక గురు బోధ యెందుకు ?

గు : బంగారమునకు వెలిగారం తోడు కావలసినట్లు గురుబోధలేనిదే యెరుక విడువదు.

శి : ఐతే అట్టివాడు పరిపూర్ణమున్నదనీ యెరుక లేదనీ గురుబోధ స్మరించుకొంటూ వుండవలెనా?

గు : స్థితి లక్షణం కుదిరితే ఇక పరిపూర్ణమనీ యెరుక యనీ ఏమాటనూ అనడు. అట్టివానికే భ్రాంతులూ పుట్టవు.

శి : కృతకృత్యుడనై తిగదాయని ఆనందములో నుండునా ?

గు : ఆనందమూ యేమీ వుండదు, వెనుక వుట్టితినని, పెరిగితినని మొదటగు ఆలోచనలేమీ యుండవు: రాబోయే చావుకంటె ముందే (ఇపుడే) చచ్చియుండును. ఈచావు గలిగితే యెప్పటికీ ఏచావూలేదు.

శి : ఇట్టి నిరావరణ స్థితి నిశ్చయం కావాలంటే విచారణ బాగా చేస్తూ వుండవలెనా ?

గు : సర్వ భ్రమరాహిత్యమైతేనే గాని నిరావరణ స్థితినిశ్చయముకాదు. విచారణ పరిపూర్ణునికీ అవసరంలేదు. కేవలం మూఢునికీ అక్కరలేదు. మధ్యవానికేకావాలి.

శి : పరిపూర్ణుని కెందుకక్కరలేదు ?

గు : అమృత కలశము హస్తమందున్న వారికి ఆకలిబాధ లేనట్లు పరిపూర్ణనికి బోధ భ్రాంతిలేదు. తాను లేనని దృఢమైతే యేబోధా అవసరం లేదు.

శి : ఇట్లు చెప్పటమిధ్యావాదమౌతుందేమో ?

గు : మిధ్య అని ఏది పల్కుచున్నదో అదే మిధ్యనీ తెల్సుకోక "అదిమిధ్య యిదిమిధ్య" అనడమే మిధ్యావాదము "మిధ్యాజ్ఞానేన మిధ్యాభ్రాంతి" అన్నారు యిదిజ్ఞానము అనడం అజ్ఞానం అనటం చేతనే, ఎరిగేదే మిధ్యయని తెలిస్తే, ఏదీ పుట్టదు.

శి : యిట్టిబోధ యెట్లు దృఢమగును ?

గు : గురుకులవాసము, గురుశుశ్రూషవుండి పూర్ణబోధ పొందవలెను.

శి : యెరుక పనికిమాలినదికదా ! దాని స్వరూప స్వభావములుకూడా తెలుసుకోవలెనని అంటారు, ఎందుచేత ?

గు : శత్రువుయొక్క లోతు (రహస్యము) తెలిస్తేనేగాని వానిని జయించరాదు. ఎరుకమార్గమవలంబించి ఆపైన దానిని పరిత్యజిస్తే యేభ్రాంతి పుట్టదు. నిర్విషయానుభవము కలుగవలెనన్నా నిరాశ్రయపదము చిక్కవలెనన్నా పరిపూర్ణబోధయే సూటిమార్గము.

శి : నిర్విషయానుభవము నిరాశ్రయపదము అనగానేమి ?

గు : ఏకోరికా లేక యుండడమే. తన్ను మ్రింగటమే తత్వాతీతము అపుడు కాని కోరికలు పోవు.

శి : తన్ను మ్రింగటమంటే ఏమి ? తన్ను తానెట్టుమ్రింగును ?

గు : తానను భ్రమను వదలుటయే తన్ను మ్రింగుట

శి : యీ తానను భ్రాంతి యెట్లు వచ్చినది ?

గు : యెరుక వుండగా సర్వ భ్రాంతులు వచ్చినవి. యీ భ్రాంతులున్నంతసేపు యెరుకపోదు. దేహము రాగానే రోగము (ప్రారబ్ధము) వచ్చినది రోగము పోతేనేగాని దేహముపోదు. రెండూ ఒకేసారి వచ్చినవి. ఒకేసారిపోవాలి.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం

## గురుశిష్యసంవాదము

## పరమ మౌననిష్ట ప్రకరణం

గు : సదసద్రహితమైనదే పరమసత్యం. ఈలాగున తెలసి చచ్చినవానికి చావులేదు.

శి : చచ్చినవానికి చావులేకపోవుట యేమిస్వామీ ?

గు : సదసద్రహితమైన దొక్కటే పరమసత్యమని తెలుసుకొన్న తెలివేలేదని, తెలుసుకొంటే. ఆపైన వానికి చావులేదు. అని అర్థం.

శి : పుట్టినదానికి చావు తప్పదుగదా. ఇక చావే లేదంటే యెట్లా ?

గు : చావు అనగా తిరిగి పుట్టే లక్షణం రహితం కాకుండా చనిపోవుట, తిరిగి పుట్టకుండా వుండే విధానము సాధించి చనిపోతే అది చావు అనిపించుకోదు. దానిని సిద్ధిపొందుటయనో, బ్రహ్మైక్యం చెందుటయనో అనాలి.

శి : ఇప్పుడు తెలిసింది స్వామీ, ఐతే నాకొక సందేహమున్నది. స్వప్నమందు తోచిన దేహములు జాగ్రద్దేహములు రెండూ ఒకటేనా లేక వేరా ?

గు : అప్పుడూ యిప్పుడూ గుర్తెరిగినది ఒక్కటే. మేలుకొంటే రెండు శరీరములూ ఏమీలేవు. మెలకువలో మేలుకొంటేసరి.

శి : మెలకువలో మేలుకొనుట అనగా ఏమి ?

గు : ప్రత్యక్షముగా గానవచ్చు జగజ్జీవులకు మూలకారణమగు దానికి వేరే మూలము లేదని, పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే కలదని తెలియుటయే మెలకువ, ఇట్టి దృఢముకలిగి నిరంతరం మరువకుండుటే మెలకువలో మెలకువ. అపుడు యీ శరీరమైనా ఏమీలేదు. ఆశరీరమైనా ఏమీలేదు ఎప్పుడూ ఏమీలేదు.

శి : యెట్లా లేకపోవును ?

గు : యెప్పుడు విచారిస్తే అప్పుడే లేకపోవును ?

శి : విచారించనప్పుడు వుండి విచారిస్తే లేకపోవునా ?

గు : ఛీ ! ఆమాటకాదు ఎప్పుడూ లేదు విచారించినపుడు, వున్నదనే భ్రాంతి యేమైనావుంటే పోతుందన్నమాట.

శి : తనకు విచారణే లేనప్పుడు కూడా తాను లేనట్టేనా ?

గు : గురుకృప పొందితే, ఎప్పుడూ ఏమీ లేదనే విషయం దృఢం అవుతుంది.

శి : ఈ శరీరములకు (జాగ్రత్స్వప్న శరీరముల రెంటికి) మూలము ఏమి ?

గు : మూలము ఏమీ లేదు.

శి : ఐతే యెవరిసత్తా చేత వచ్చినవి ? ఎవరి సత్తాచేత వున్నవి ? ఎవరి సత్తాచేత పోవుచున్నవి? వీని నన్నిటిని ఎవరిసత్తా చేత యేది గుర్తెరుగును ?

గు : దేనికి సత్తా ఎక్కడాలేదు. సత్తాలేనిగుర్తు దానికదే వచ్చును. దానికదేవుండును, దానికదేపోవును, ఎవ్వరి ప్రేరితం ఏమీలేదు ఐనా కొందరికి భ్రాంతిచేత, మూలము వున్నదేమోనని తోస్తుంది. విచారిస్తే వివేకులకు మూలములేదన్న వాస్తవము తెలుసును.

శి : దేహమువుంటే ముక్తా ? లేకుంటే ముక్తా ? దేహము వుండగానే ముక్తి అనుట ఎట్లు? దేహము లేకుంటే ముక్తి అందామా అంటే దేహము లేకుంటే ముక్తి ఎవరికి ?

గు : దేహాంతమందు ముక్తి అంటే, అందరూ చస్తూనే యున్నారు. కనుక అందరికి ముక్తే అనాలి. అలాఅయితే యిక గురుబోధ ఎవరికి ? గురువుచేత గుర్తెరిగే శరీరము ఏమీ లేదని తెలియడమే ముక్తి.

శి : సుషుప్తి మూర్ఛలయందు గుర్తెరుగుట లేదుగదా ! అది ముక్తియా ?

గు : కాదు. ఇవి కేవలం అజ్ఞానావస్థలు, పశువులున్ను చెందుచున్నవి. సకల భ్రమలకు మూలమైన మూలంలేని గుర్తెరిగే శరీరం ఏమీలేదని గురుముఖతఃవిని ధ్రుడపరచుకొనవలెను.

శి : అయ్యా వచ్చేదిఏమి ? పోయేది ఏమి !

గు : వికారం కలవానికి వికారం పుట్టినా ? వికారం లేనివానికి వికారం పుట్టినా ?

శి : వికారం కలవానికే సర్వవికారాలు పుట్టుతాయి, అన్నది స్పష్టమేయెన్ని తోచినవి ? యెన్ని పోయినవి ? దానికి యేమి విచారము ?

గు : అవి ఏమైనా సత్యమైనవా ?

శి : మరైతే అవి యెందుకు తోస్తున్నవి ?

గు : మేలుకొన్న తరువాత తెలుస్తుంది. రావడం పోవడం రెండూ అబద్ధమని.

శి : యెట్లు తెలియును ?

గు : కలలోవచ్చిన శరీరాలు, ఈశరీరాలు, ఎరుకతోనే ఏమీ లేకపోతాయి అని తెలుసుకో?

శి : మరి కొంచెం వివరించండి స్వామీ !

గు : గురువాక్యము ననుసరించి తన్ను విడచిచూస్తే ఈలాగే వున్నంతసేపూ, కలయేసుమా! గురుతు వున్నంతసేపూ కలే, పోతూవున్న సమయమే జాగ్రత్త ఆపైనేమనటానికి ఏమీ లేదు.

శి : దేనిని యెందుకు జగత్తనీ, బ్రహ్మమని భ్రాంతిపడినారో ఒక దృష్టాంతరూపంగా శెలవీయండి స్వామీ !

గు : ఒక అశ్వత్థ వృక్షము, దాని చిట్టచివర ఒకఖద్యోతము (మిడుగురు పురుగు) అట్లా వున్న యెరుకను చూచి అదే బ్రహ్మమని, భ్రాంతిచేనమ్మి అది పోదని, శాశ్వతమని, సిద్ధాంతం చేసినారు ఇట్లా నమ్మి అనేక గ్రంథాలు చేసి నమ్మి దృఢపరచుకొన్నారు.

శి : అన్ని మతాలవారు యింతేనా ?

గు : కాదు, కొందరు సగుణమనీ, కొందరు నిర్గుణమనీ, సగుణ నిర్గుణమనీ కొందరు అచలము అవ్యక్తమనీ అన్నారు.

శి : మరి మీసిద్ధాంతం ఏమి ?

గు : అది కనురెప్పపాటైనా కదలకుండావుండదు. అది అన్ని రూపాలైవున్నది. తన్ను సర్వగ్రంథములచేతను సమర్థించుకొన్నది. కాని వుంటే వుంటుంది. పోతేపోతుంది.

నమ్మకూడదు. అదిలేదంటే అందరికీ నిష్ఠూరము, దానిని నమ్మితే కర్మము బాయదు. తాను, యెరుకా రెండూ ఒకటే ఇదేస్వప్నము. ఇది పోతే ఏమీ లేదు.

శి : అయ్యా ! దేహాలు యెన్ని ?

గు : దేహమేలేదని చెప్పితే దేహములు ఎన్ని అంటావేం ? వూరేలేదంటే పొలిమేర ఎక్కడ అన్నట్లుగా వుంది.

శి : కొన్ని శరీరములు సత్యం. కొన్ని అసత్యం అని కొందరంటున్నారు గదా !

గు : ఇన్ని దేహములే అబద్ధం. ఒకటే శరీరం, అది పుట్టనేలేదు, పోనూలేదు.

శి : తానున్నాడు గదా ! తన మాటఏమి ?

గు : వున్నానని భ్రాంతిచేత తనకు తోచడమే కాని వాస్తవం కాదు. పట్టముట్ట రాని బట్టబయలు మాత్రమే స్వతసిద్ధమైయున్నది. గురుకృపయనే భూతిసోకితే యెరుకనే పిశాచం యెక్కడానిల్వదు. లేనిచో లేనిదే అనేక శరీరాలుతోచును. ఒక్క శరీరమే యెక్కడాలేదు. ఐదు శరీరాలు అని అననేకూడదు.

శి : అయ్యా. వచ్చేదిఏమి పోయేది యేమి ? నడిచేది ఏమి ? సత్యము దేనికి ? అసత్యము దేనికి ? వున్నదానికి చెప్పకూడదు లేనిది లేకపోయేగదా !

గు : తోచేదానికే అన్నీని, తోచేది దేనికి అంటావేమో ? లేనిదానికే

శి : లేకుంటే, ఎట్లాతోస్తుంది ?

గు : కలవలె. తెలివి విడచితే తెలుస్తుంది. ఆపైన సంశయముంటే నన్నడుగు.

శి : అయ్యా ! శంకలుదీరెను. గురుదక్షిణగా మీకేమి సమర్పించను ?

గు : నీకేమి వున్నది ? నాకేమి యిస్తావు ? నీకువుంటే నాకు యివ్వు.

శి : ఏమి యిచ్చేది ? నాకేమీ తోచదు ?

గు : అనేది మాకు యిచ్చేయి.

శి : సర్వం యిదివరకే అర్పించుకొంటినే.

గు : అర్పించుకొంటే మాట్లాడడానికి మళ్ళీ యెక్కడనుంచి వస్తివి.

శి : అయ్యా ! మీరేమాట్లాడుచున్నారు. నేనులేను. నేను మాట్లాడనేలేదు.

గు : నాకు నిన్ను ఏలాగు సమర్పించుకొంటివి ?

శి : మీరే చెప్పండిస్వామీ ! మీతో చెప్పేపాటి సామర్థ్యం గలవాడనా ?

గు : నీవు లేకపోవడమే భ్రాంతిరహితం. అదియే మాకిచ్చుట దావానలము వాయు సహాయంచేత వనమంతా కాల్చితుదకేమీ లేకపోతుంది. చెప్పిన వాక్యము చేతనూ, అవాక్యానుగుణ్యమైన బోధచేతను నీవు విచారించుకొంటే ఏమీలేకుండా పోతావు. విచారించి చూచుకో !

శి : విచారించి చూస్తేనేనేమీ లేనని తోస్తూవుంది. ప్రశ్న చేదామంటే ఏమిలేదు. ఏలాగున అడుగుదునని నాలో నాకే సిగ్గవుతోంది. నేనడగలేను కానిమీరు చెప్పవలెనని తోస్తుంది. నాకు మూలంలేదు. నాకు శ్రవణం చేయడానికి యిచ్ఛాలేదు.

గు : భేష్; బాగానేవుంది గాని పరిపూర్ణంమాట ఏమి ?

శి : ఏమో ! వున్నది పరిపూర్ణమనియంటే, అన్నది మిగిలిపోతోంది. మీరుచెప్పిన బోధచేత అదిపోయెను కనుకయే భ్రాంతులు లేవు.

గు : ఈ బోధ భ్రాంతిరహితము గనుక భ్రమలుతోచవు ఇది నిలుపుకోవడం కఠినం, గురుకృపచేత అత్యంతసులభం.

శి : ఇట్టి సద్గురుబోధ మాటఏమి ?

గు : దానికేమీ పాదులేదు. కనుక అదీ ఏమీలేదు. పాషాణ ప్రతిమకు జ్వరం వచ్చినదన్నట్లు అదీ స్వప్నంలో భాగమేకాదా !

శి : అస్వప్నం సంగతి పూర్తిగా చెప్పండి స్వామీ !

గు : స్వప్నం మందు దోచిన శరీరాలకు మాతాపితృలు, కులగోత్రాలు, పాపపుణ్యాలు, బంధమోక్షాలు, ఏలాగునలేవో అలాగే యీ దీర్ఘస్వప్నము నందున్నూ.

శి : ఆ స్వప్నమునకున్ను, యీదీర్ఘ స్వప్నమునకున్ను ? యింకా పోలికలు చెప్పండి స్వామీ.

గు : దీర్ఘస్వప్నమనేదేలేదు కనుక ఏమీలేదు. స్వప్న దేహాలకు ఆగామి సంచిత ప్రారబ్ధములు చెప్పుట ఏమీ ?

శి : కలలో వచ్చినవి కల రాకమునుపెక్కడనున్నవి ! మేలుకొంటే ఎక్కడ వున్నవి ? యేమీలేదు.

గు : వచ్చినవని ఎవరికి తోచును ? కలలో వున్నవానికేవచ్చినట్లు తోస్తాయికాని, మేలుకొన్నవానికి అవి సత్యంగా తోస్తాయా ? కనుక లేక తోచేదేహాలు వుంటాయి. పోతాయి. అని విచారణ ఏల ?

శి : విషయం దృఢం చేసుకొనుటకే తమవంటి ఆరూఢులకేమీ అవసరం లేదు. మావంటివారి కోసమే మీరు మరీమరీ చెప్పడం !

గు : స్వప్నమందు పుట్టినట్టు స్వప్నంతోనే పోయినట్టుతోచే దేహాలకు విచారము ఏమైనా వున్నదా అన్నదికూడా విచారించు. ఈదీర్ఘస్వప్నంలో భార్యాభర్తలు, బంధు మిత్రులు అనేక మంది వున్నా పోయినా తానే స్వప్నమని తెలిస్తే ఏమైనా భ్రాంతి వుండునా ?

శి : తానేకల దానికీ గురుబోధయే మేల్కొ అని యిపుడు తెలిసింది స్వామీ !

గు : గురుబోధానంతరం, సర్వభ్రమలు, భ్రమమూలమైన యెరుక అణుమాత్రమైన లేకుండా తమకు తామే పోవును. ఆపైన అంతా పరిపూర్ణబ్రహ్మమే అనుటకు కూడా ఎవరూ లేరు.

******